# ముముక్షుప్పడి

అను

# తిరుమంత్రార్థము

ఇత్యాది

గుంటూరు మండలాంతర్గత

అలపాడుగ్రామ వాస్తవ్యులగు

శ్రీమాన్, ఘటకఘటం రామానుజాచార్యుల

వారిచే తెనుగున వ్రాయబడి,

కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి

శ్రీమాన్, కందాడై శేషాచార్యులవారిచే

పరిష్కరింపఁబడి

గ్రంథకర్తచే,

వేదాంతముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడినది.

గుంటూరు.

రెండవకూర్పు 1000 కాపీలు

1939.



శ్రీమాన్ ధనకుధరం రామానుజాచార్యులవారు　　వారి దేవిగారు

శ్రీమతే రామానుజాయ నమః.







# ముముక్షుప్పడి

అను

# తిరుమంత్రార్థము.

## తిరుమంత్ర ప్రకరణము.

1. ముముక్షుప్పడియనఁగా మోక్షమును కోరినవారికి దెలియవలసినది.

2. మోక్షమంవిచ్ఛగలవానికిఁ దెలియవలసిన రహస్యములు మూడు. రహస్యమనఁగాఁ దెలిసికొనవలసినది. అనఁగా నుపదేశముచేతఁ దెలియదగినది.

అందు ప్రథమరహస్యము తిరుమంత్రము అనఁగా నారాయణాష్టాక్షరీ. మంత్రమనఁగాఁ దన్ననుసంధించు వారలను రక్షించునది.

3. తిరుమంత్రముయొక్క గౌరవమునకుఁ దగినట్లు భక్తితో నాదరించి అనుసంధించవలయును. అనుసంధాన మనగా మననము.

4. మంత్రమందును, మంత్రమునఁ జెప్పబడు దైవమందును, మంత్రము నుపదేశించిన యాచార్యులయందును భక్తి మిగుల నుండెనేని, కార్యకరమగును. ఆచార్యుడనగా మంత్రమందుగల యర్థమును దానాచరించి శిష్యునిచేత తానాచరింప చేయువాడు.

5. సంసారులు స్వస్వరూపమును, భగవంతుని స్వరూపమును మఱచి తెలిసికొనక, ఈశ్వరకైంకర్యమునకు జెడి, చెడితి ననువిచారమైనను లేక, సంసారమను సముద్రమందు బడి దరిగానక బాధను జెందుచుండగా, భగవంతుడు తన నిర్హేతుక కృపచేత ఈ సంసారులు తన్ను దెలుసుకొని దరిని జేరునట్లు, నరనారాయణరూపముగా శ్రీబదరికాశ్రమమున దానే శిష్యుడును దానే యాచార్యుడును నైయుండి నారాయణాష్టాక్షరీ మంత్రమును వెల్లడిపఱచెను.

6. శిష్యుడుండవలసిన క్రమము లోకులకు దెలియక పోవుటచేత దానిఁ దెలియఁజేయుటకై భగవంతుడు నరుడను పేరుతో శిష్యుడై యుండెను.

7. సకల శాస్త్రములను జదివి సంపాదించెడు జ్ఞానము

స్వార్జితక్షేత్రమువంటిది. తిరుమంత్రమును జపించి సంపాదించు జ్ఞానము పిత్రార్జితమువంటిది.

8. ఈ నారాయణాష్టాక్షరి యనెడు తిరుమంత్రమేగాక వాసుదేవద్వాదశాక్షరి, విష్ణుషడక్షరి మొదలగు మంత్రము లనేకములు గలవు.

9. ఈమంత్రములు వ్యాపకమంత్రములనియు నవ్యాపకమంత్రములనియు రెండువిధములు. వ్యాపక మంత్రములనగా భగవంతునియొక్క సర్వవ్యాపకత్వమును జెప్పునవి. అవ్యాపక మంత్రములనగా భగవంతునియొక్క సర్వవ్యాపకత్వమును జెప్పక ఆయనయొక్క అవతారగుణచేష్టితములలో నొక్కొక్క దానిని జెప్పునవి.

10. అవ్యాపకములైన దక్కినమంత్రములకంటె వ్యాపక మంత్రములగు నారాయణ, వాసుదేవ, విష్ణు మంత్రములు శ్రేష్ఠములు.

11. ఈ మూటిలో, పెరియ తిరుమంత్రమును నారాయణాష్టాక్షరీ మంత్రము ప్రధానమైనది.

12. మిగిలిన వాసుదేవ విష్ణుమంత్రములు రెంటికిని యితర మతస్థు లవలంబించుటయు స్వరపూర్తి లేక పోవుటయు గలవు.

13, నారాయణాష్టాక్షరిని అనాదిసిద్ధములైన వేదములున్ను, పరాశరాది ఋషులును, సదాచార్యులు మొదలగు

నాళ్వారులున్ను, నాథమునులు మొదలగు పూర్వాచార్యు లున్ను ఆదరించిరి.

14. మంత్రమున కర్థభూతుడైయున్న భగవంతునివైభవముకంటె యీమంత్రవైభవ మధికమైయున్నది.

15. ఈశ్వరుండు అదృశ్యుడైనను, మంత్రముదృశ్యమైయుండి యుపకరించును.

16. భీష్ములు మొదలగువారి సభయందు దుశ్శాసనునిచేత మానభంగమునొందిన ద్రౌపదికి చీరెలను వృద్ధినొందించి మానమును గాపాడి రక్షించిన మంత్ర మిదియే గదా.

17. ఈ మంత్రము, భక్తి మొదలగు గౌరవము తోడను సంధించక యనుసంధించినను, దానివ్వవలసిన ఫలమునకు లోపము జేయదు.

18. ఈ మంత్రము కులము మొదలైన సకలాపేక్షితముల నిచ్చును.

19. ఐశ్వర్యము, కైవల్యము, భగవల్లాభము మొదలయినవాటి నపేక్షించువారికి వాటినిచ్చును. ఐశ్వర్యమనగా నిహలోకమందున్ను, స్వర్గాదులయందున్ను యనుభవించు సంపద, కైవల్యమనగా పరమపదమునకు సంబంధించియున్న యొక స్థలమందుండిచేయు కేవలాత్మానుభవము. భగవల్లాభమనగా ముక్తుడై పరమపదమునందు శుద్ధసత్వ దేహముతో జేయు పరమపురుషార్థమైన భగవత్కైంకర్యము.

20. భగవత్ప్రాప్తిసాధనములగు కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగముల నవలంబించువారలకు తన్నిద్ధ్యర్థమై యీ మంత్రమును సహాయముగా గోరినయెడల, వాటికినుండు ప్రతిబంధకములను పోగొట్టి వాటిని సిద్ధింపజేయును. కర్మయోగమనగా యజ్ఞ దాన తపోధ్యాన సంధ్యావందన పంచమహాయజ్ఞాగ్నిహోత్ర తీర్థయాత్రపుణ్యక్షేత్రవాస కృచ్ఛ్రచాంద్రాయణపుణ్యనదీస్నాన వ్రతక్రతు చాతుర్మాస్యఫలమూలాశన శాస్త్రాభ్యాస సమారాధన జపతర్పణాదులచేత గలుగు దేహశోషణమువలన పాపమునశించినందువలన ఇంద్రియద్వారా ప్రసరించుజ్ఞానమునకు క్షుద్రవిషయములు గోచరములు కాకపోవుటచేత దద్విషయమందభిలాషగలిగి యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధిరూపమైన యష్టాంగయోగక్రమములచేత యోగాభ్యాసకాలమువరకు జ్ఞానము యాత్మను లక్ష్యముగాఁ జేయుట. జ్ఞానయోగమనగా కర్మయోగమువలన జ్ఞానమునకు బుట్టిన జ్ఞానమున హృదయకమలము నాదిత్యమండలము మొదలగు స్థలములయందు వేంచేసియుండు సర్వేశ్వరుని లక్ష్యముచేసి ఆయనను శంఖచక్రాదులతో గూడియున్నవానినిగాను, పీతాంబరధరునిగాను, కిరీటాదివివిధభూషణాలంకరిష్టునిగాను లక్ష్మీసమేతునిగాను యనుభవించి, యోగాభ్యాసక్రమముచేత ననుభవకాలమును వృద్ధిజేయు

చుచు నెడతెగని ధ్యానముచేయుట. భక్తియోగమనగా జ్ఞాన యోగమువలన గలిగిన తైలధారవలె నెడతెగని స్మృతి సంతానరూపమైన యనుభవమును బ్రీతిరూపముగా జేయుట

21. ఈమంత్రము ప్రపత్తిలో దిగినవారికి భగవత్పారతంత్ర్యమనెడు స్వరూపజ్ఞానమును విశదముగా బుట్టించి కాలక్షేపమునకు భోగమునకు హేతువైయుండును. ప్రపత్తియనగా—కర్మజ్ఞానభక్తులు స్వతంత్రోపాయములగుట చేత కేవల భగవత్పరతంత్రమైన యాత్మస్వరూపమునకు విరుద్ధము లని వాటినిచేయుట కసమర్థుడై భగవత్సన్నిధియందు జేయు భరసమర్పణము. అనగా తన రక్షణభారము దనకు లేదనే జ్ఞానముతో నీశ్వరునియందా భారము సమర్పించి నమ్మి యుండుట. ఈప్రపత్తి యార్తప్రపత్తియనియు, దృప్తప్రపత్తి యనియు రెండువిధములు, ఆర్తప్రపత్తియనగా భగవన్నిర్హేతుకకృపచే జ్ఞానముబుట్టగానె భగవదనుభవమునకుఁ బ్రతిబంధములైన యీదేహమును, యీదేశమును, యీదేశస్థులనెడు నీచ సహవాసమును సహింపజాలక, భగవదనుభవమునకుసహకారమైన ముక్తదేహమును, ముక్తస్థానమును, ముక్తపురుషుల సాన్నిధ్యమునుబొందుటకై త్వరపడి యార్తితోజేయు ప్రపత్తి ఆర్తప్రపన్నులకు వెంటనే ముక్తికల్గును. ఇట్టి ప్రపన్నులాళ్వారాదులు మొదలగు పదకొండుగురు. దృప్తప్రపత్తియనఁగా-

ఇట్టియార్తి మాత్రములేక తనరక్షణభారమును భగవంతునియం దు సమర్పించి నమ్మి స్వామియొక్క ఆజ్ఞాకైంకర్యమును జేయుచుం డుట. ఇట్టిదృప్తప్రపన్నులకు దేహావసానకాలమందు మోక్షము గలుగును. వీరు నాథమునులు మొదలగు పూర్వాచార్యులు. కాలక్షేపమనఁగా తిరుమన్త్రమందుఁ జెప్పఁబడిన యర్థానుసం ధానాదులచేత గాలమును వెళ్ళబుచ్చుచుండుట.

22. ఆత్మోజ్జీవనమునకు సాధనముగాఁ దెలియనలసిన యర్థవిశేషములన్నియు నీమంత్రమందే యున్నవి.

23. అవి అయిదర్థములు. అవి ఏమనగా నొకటి స్వస్వ రూపము, రెండు పరస్వరూపము, మూడు పురుషార్థస్వరూపము నాల్గు యుపాయస్వరూపము. అయిదు విరోధిస్వరూపము స్వస్వరూపమనగా జీవస్వరూపము. ఈ జీవస్వరూపము పంచవిధ ములు. ఒకటి నిత్యులు. రెండు ముక్తులు. మూడు బద్ధులు. నాల్గు కేవలులు. అయిదు ముముక్షువులు. నిత్యులనగా సం సారసంబంధములేక నిత్యవిభూతియందు భగవంతుని సన్నిధిని నిత్యకైంకర్యము జేయుచుండు అనంత గరుడ విష్వక్సేనాదు లు. ముక్తులనగా భగవత్కృపచేత సంసారసంబంధమునువదలి నిత్యవిభూతినిబొంది నిత్యులవలెనె పునరావృత్తి లేకుండ నిత్య కైంకర్యమును జేయుచుండువారు. బద్ధులనఁగా సంసారమం దుండి దేహాత్మాభిమానముగలవారై క్షుద్రభోగమునే పురు షార్థముగాఁదలంచుచు, నాత్మజ్ఞానముగాని భగవద్జ్ఞానముగాని

లేక అహంకార మమకారములలో మునిగి దారాపుత్రాదుల యందు మోహముగలిగి యుండువారు. కేవలులనగా సంసారమనుదావాగ్ని చేత తప్తులై ఆతాపనివృత్తికి సాధనముగా శాస్త్రాభ్యాసము జేసినందువల్ల ప్రకృతికంటె ఆత్మవిలక్షణమైనదనియు, ప్రకృతి దుఃఖాస్పదమైనదనియుఁ దెలిసికొని అట్టి ప్రకృతి సంబంధనివృత్తికొఱకు భగవంతుని ధ్యానము జేసి, ఆత్మానుభవరూపమైన కైవల్యమోక్షమును సంపాదించుకొని అనుభవించువారు. ముముక్షువులనగా భగవదనుభవార్థమై దానికి విరోధియైన సంసారనివృత్తిని ప్రార్థించి భక్తిప్రపత్తిమొదలగు భగవత్ప్రాప్తిసాధనముల నవలంబించి యుండువారు. పరస్వరూపమనగా ఈశ్వరస్వరూపము. ఇది యైదువిధములు అవియేవగా ఒకటి పర, రెండు వ్యూహ, మూడు విభవ, నాల్గు అంతర్యామి, అయిదు అర్చావతారములు. పరమనగా శుద్ధసత్త్వమై త్రిపాద్విభూతియను పేరుగల నిత్యవిభూతియందు నిత్యసూరిసేవ్యమైయుండు పరవాసుదేవ మూర్తి. రెండు వ్యూహమనగా వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ వ్యూహములయందు ఆయానామములతో జగత్సృష్ట్యాదులను జేయుచుండు భగవత్స్వరూపములు. మూడు విభవములనగా రామ కృష్ణ నృసింహాద్యనంతావతారములు. ఈ యవతారములు రెండువిధములు ముఖ్యములని గౌణములని, ముఖ్యావతారమనగా జీవసంబంధములేక జగద్రక్షణార్థమై "రామకృష్ణనృసింహార్చాపూర్ణషాడ్గు

ణ్యమూర్తయః" అనుప్రకారముగా షడ్గుణములతో బూర్ణుడైన సర్వేశ్వరుడు సాక్షాదవతరించిన రామకృష్ణాద్యవతారములు. గౌణావతారములనగా జీవులయందు నాయాపనులకొఱకై భగవదంశమున వేంచేసిన యవతారములు, ఇవి వ్యాసదత్తాత్రేయాద్యవతారములు. వీనిని ముముక్షువులు మోక్షసాధనముగా నుపాసింప బనిలేదు. నాల్గు అంతర్యామియనగా సమస్తవస్తువులయందు వ్యాపించియుండు భగవత్స్వరూపము. ఈ వ్యాప్తి రెండువిధములు. ఒకటి స్వరూపవ్యాప్తి. రెండు విగ్రహవ్యాప్తి. స్వరూపవ్యాప్తియనగా సర్వభూతములయందున్న సూక్ష్మరూపుడై భగవంతుడువ్యాపించియుండుట. రెండు విగ్రహవ్యాప్తియనగా భక్తులయందలి యనుగ్రహముచేత వారిహృదయకమలములలో నంగుష్ఠమాత్రప్రమాణముగాలక్ష్మీసమేతుడై వేంచేసియుండుట. అయిదు అర్చావతారమనగా భక్తులయొక్క యిచ్ఛానుసారముగా స్వామి ఆయా నామరూపములను బరిగ్రహించి దర్శనమిచ్చెడి బహువిధములయిన విగ్రహములు. ఇవి కూడ నాల్గు విధములు. ఒకటి స్వయంవ్యక్తములు. రెండు దివ్యములు. మూడు సిద్ధములు. నాల్గు మానుషములు. స్వయంవ్యక్తములనగా నరసింహాద్యవతారములవలెనె భగవంతుడు స్వయముగా నావిర్భవించినవి. రెండు దివ్యములనగా దేవతలచేత బ్రతిష్ఠితములైనవి. మూడు సిద్ధములనగా సిద్ధులచేత బ్రతిష్ఠితములైనవి. నాల్గు మానుషములనగా మనుష్యులచేత బ్రతిష్ఠితము

లైనవి. పురుషార్థమనగాఁ బురుషులచేత కోరఁబడినది. అది అయిదు విధములు. ఒకటి ధర్మము. రెండు అర్థము. మూడు కామము. నాల్గు ఆత్మానుభవము. అయిదు భగవదనుభవము. ఒకటి ధర్మమనగా ప్రాణిరక్షణమున కుపయోగముగా జేయు పనులు, రెండు అర్థమనగా వర్ణాశ్రమముల కుచితముగా ధన ధాన్యాదులను సంపాదించి దేవతావిషయములయందును పైతృక కర్మలయందును బ్రాహ్మణులయందును దేశకాల పాత్రముల నెఱిగి ధర్మబుద్ధితో ఖర్చు పెట్టినది. మూడు! కామమనఁగా నిహాపరలోకములయందు అనుభవించు సుఖవిశేషము. ఇహలోకసుఖమనఁగా జననీజనక భార్యా పుత్ర మిత్ర శత్రు ధన ధాన్య గృహక్షేత్ర వస్త్ర చందన పుష్ప తాంబూలాన్నపానాదుల యనుభవమువలన గల్గుసుఖము. పరలోక సుఖమనగా నిహలోకముకన్నా విలక్షణమైన స్వర్గాది లోకములకుఁ బోయి అకలి దప్పిక దుఃఖము ముసలితనము మరణము మొదలగునవి లేక, సంపాదించిన పుణ్యమునకుఁ దగినట్లు అమృతపానము జేసి రంభాది అప్సరాదులతో సుఖించుట. నాల్గు ఆత్మానుభవమనగా శోకనివృత్తిమాత్రమగు కేవలాత్మానుభవము అయిదు. భగవదనుభవమనగా జీవుడు జేసిన భక్తి ప్రపత్తులవల్ల పుణ్య పాపములను నశింప జేసి, మూర్ధన్యనాడీద్వారా ఈ శరీరమును విడిచి, యర్చిరాదిమార్గమున పరమపదముకుఁ బోయి శుద్ధసత్వదేహమునుబొంది లక్ష్మీభూ నీళానాయకుడగు శ్రీమన్నా

రాయణుని నిత్యసేవ చేయుచుండుట. నాల్గు ఉపాయస్వరూప మనగా భగవత్ప్రాప్తినిగలుగజేయు సాధనస్వరూపము. ఇది యైదువిధములు. ఒకటి కర్మము, రెండు జ్ఞానము, మూడు భక్తి, నాల్గు ప్రపత్తి, అయిదు ఆచార్యాభిమానము. ఇందు లో కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తుల వివరణము. (21-22) సంఖ్యలు గలవాక్యములలో చేయబడినది. ఆచార్యాభిమానమనగా చేతనుడు, కర్మజ్ఞానభక్తి ప్రపత్తులయందు నశక్తుడై యుండునప్పుడు, వీని యందు గనికరించి, వీని లాభమునకై భగవత్సన్నిధి ని ప్రపత్తి జేసి, వీనిజ్జీవింపఁ జేయువారై జ్ఞానానుష్ఠానసంపన్నులగు నాచార్యుల యభిమానమునకు పాత్రుడై యుండుట. ఇది రెండువిధములు, ఒకటి స్వగతస్వీకారము, రెండు పరగతస్వీకారము, స్వగత స్వీకారమనగా, చేతనుడు ఆశ్రయించిన పైని ఆచార్యు డభిమానించి స్వీకరించుట. పరగత స్వీకారమనగా, తా నాశ్రయించకపోయినను, ఆచార్యు డభిమానించి స్వీకరించుట. అయిదు విరోధిస్వరూపమనగా, చేతను డపేక్షించు లాభమునకు విరోధించినది. ఇది అయిదు విధములు, ఒకటి స్వస్వరూపవిరోధి, రెండు పరస్వరూప విరోధి, మూడు పురుషార్థస్వరూపవిరోధి, నాల్గు ఉపాయస్వరూపవిరోధి, అయిదు ప్రాప్తి విరోధి, స్వస్వరూప విరోధియనఁగా దేహమే యాత్మయనుభ్రమయును, భగవదితరులకు శేషభూతుఁడనను భ్రమయును, స్వస్వాతంత్ర్యమును. రెండు పరస్వరూపవిరోధి యనగా, దేవ

తాంతరములయందు పరత్వబుద్ధియును, దేవతాంతరముల యందు భగవంతునితో సమానబుద్ధియును, క్షుద్రదేవతాదులందు మహత్త్వబుద్ధియును, భగవదవతారములయందు మానుషప్రతిపత్తియును, అర్చావతారమునందు సశక్తి ప్రతిపత్తియును. మూడు పురుషార్థ విరోధియనగా, భగవత్కైంకర్యరూప ఫలమునకంటె యితరమైన ఐశ్వర్య ఫలములను గోరుటయు, భగవంతునియొక్క ఇష్టానిష్టములను విచారింపక తనకిష్టమువచ్చిన కైంకర్యమును జేయుటయును. నాల్గు ఉపాయ విరోధి యనగా, ప్రపత్తికంటె నన్యములైన భగవత్ప్రాప్త్యుపాయములందు వైలక్షణ్య ప్రతిపత్తి. అనగా, ఆధిక్యబుద్ధియును ప్రపత్త్యుపాయము సులభముగా జేయదగినది కాబట్టిన్ని, దీనిచేత బొందవలసిన ఫలము గొప్పది కాబట్టిన్ని, ఈ ఫలము బొందుటకు విరోధులైన మనము చేసుకున్నట్టి పాపములధికములు గాబట్టిన్ని ఈప్రపత్తివల్ల నింతఫలము గలుగునో లేదో యను సంశయమున్ను. అయిదు ప్రాప్తివిరోధియనగా, భాగవతుల విషయమైనను, ఆచార్యులవిషయమైనను, వారికి శిష్యులై తనతో సబ్రహ్మచారులగు వారివిషయమైనను జేయు అపచారములు.

24. పూర్వాచార్యులీమంత్రమందర్థము దెలియుటకు మునుపు తాము బుట్టినవారుగా దలంచి యుండరైరి. దీనియందైన యర్థజ్ఞానము గల్గినవెనుక నీమంత్రార్థముతో గాక మఱియొకదానితో కాలమును బుచ్చి యెఱుగరు.

25. మంత్రార్థ మక్కఱలేకుండ. మంత్రమేతనుచ్చరించిన మాత్రము చేతనే సమస్తఫలముల నిచ్చునదియైయుండగా, మంత్రమునకంటె యర్థమందే పూర్వాచార్యులందఱును నాసక్తి గలిగియుండుటకు హేతు వేమనగా, వీరు కోరుఫలము భగవంతుడగుట చేత నీఫలమునిచ్చువాడు భగవంతుడగుట చేతను, ఈ మంత్రార్థము భగవదేకోపాయ మగుట చేతను అర్థమందే ఆసక్తిగలవారై యుండిరి.

26. ఈమంత్రమునం జెప్పఁబడుచున్న యర్థము (ఓం) అను ప్రణవము చేత జీవులయొక్క శేషత్వమున్ను (నమః) అను పదము చేత జీవునియొక్క పారతంత్ర్యమున్ను ఈ రెండుపదములుగలసి జీవునియొక్క శేషత్వపారతంత్ర్య స్వరూపములను జెప్పుచున్నవి. (నారాయణాయ) అను పదము చేత జీవుడు భగవంతుని విషయమై జేయవలసిన కైంకర్యరూపమైన ఫలము జెప్పబడుచున్నది. ప్రణవము చేత జీవుని శేషత్వమును, నమః పదము చేత భగవదేకోపాయమును, నారాయణాయ పదము చేత కైంకర్యమున్ను జెప్పఁబడుచున్నవి.

27. జీవుడు బొందవలసిన ఫలముయొక్క వివరము ప్రమేయశేఖరమను గ్రంథములోనున్ను అర్చిరాదియను గ్రంథములోనున్ను చెప్పబడియున్నది. ఈ యాత్మ అర్చిరాదిమార్గముగా బరమపదమునకుఁబోయి పరిపూర్ణ భగవదనుభవము జేసినందున గలిగినప్రీతి చేత ప్రేరణ జేయబడినవాడై భగవం

తుని విషయమై జేయు సర్వవిధ కైంకర్యములే ఫలముగాఁ గ్రంథములయందు జెప్పబడుచున్నది.

28. ఈ మంత్ర మెనిమిదక్షరములు మూఁడుపదములు గలదై యుండును. (ఓం) అను నొకయక్షరము (నమః) అనునది రెండక్షరములు (నారాయణాయ) ఐదక్షరములు. ఈమంత్రము నారాయణోపనిషత్తునం దష్టాక్షరిగాఁ జెప్పఁబడుచున్నది.

29. ఈ మూఁడుపదములున్ను మూఁడర్థములను జెప్పుచున్నవి. ఇవియేవనగా— శేషత్వమున్ను పారతంత్ర్యమున్ను కైంకర్యమున్ను.

30. ఇందులో మొదటిపదము ప్రణవము.

31. ఇది (అ) కార (ఉ) కార (మ) కారముతో గలసి (ఓం) అని పలుకబడుచున్నది.

32. బ్రహ్మ వేదాధ్యయనముజేయు సమయమందు ఋగ్వేదమువలన (భూః) యను వ్యాహృతియును, యజుర్వేదమువలన (భువః) యను వ్యాహృతియును, సామవేదమువలన (సువః) యను వ్యాహృతియును దఱచిచూడఁగా వీటిలోనుండి అకార ఉకార మకారములను మూఁడక్షరములుం గ్రమముగా బుట్టినవి.

33. కాబట్టి యీ ప్రణవము సకల వేదసారమని చెప్పబడినది.

34. ఇంక (అ) కారము సర్వశబ్దములకున్ను కారణమై నారాయణ శబ్దమునకు సంగ్రహమై యుండుటచేత సకల జగత్తుకున్ను కారణమై సర్వరక్షకుడై యున్న ఈశ్వరుని జెప్పుచున్నది. (అ) కారము సమస్త శబ్దములకు గారణమగుటవలనను యీశ్వరుడు సమస్తవస్తువులకుఁ గారణమగుటవలనను (అ) కారముచే భగవంతునియొక్క సర్వకారణత్వము జెప్పబడుచున్నది. "అవ రక్షణే" యను ధాతువు వల్ల గలిగినందున భగవంతునియొక్క సర్వరక్షకత్వమునున్ను జెప్పుచున్నది.

35. రక్షించుట యనగా విరోధిని బోగొట్టుటయున్ను అపేక్షితముల నిచ్చుటయున్ను.

36. సంసారులకు విరోధి శత్రుపీడాదులు అనగా తాపత్రియమువల్ల గలుగు పీడలు. తాపత్రయమనగా ఒకటి ఆధ్యాత్మికము. రెండు ఆధిదైవికము. మూడు ఆధిభౌతికము. ఆధ్యాత్మికము రెండువిధములు. ఒకటి శారీరకము, రెండుమానసికము. ఒకటి శారీరకమనగా శరీరమునకుసంభవించు బహువిధవ్యాధులు. రెండు మానసికమనగా కామ క్రోధ లోభ మోహామదమాత్సర్యవిషాదశోకావమానాసూయాదులగు మనోవ్యాధులు. రెండు ఆధిదైవికమనగా చలిగాలియెండవానపిడుగులు మొదలగువాటివల్లబుట్టు తాపము. మూడు ఆధిభౌతికమనగా పశుపక్షిపిశాచమానుష సర్పరాక్షస క్షుద్రజంతువులు మొదలగు వాటివలన గల్గు తాపములనఁగా పీడలు. సంసారుల కపేక్షితములన్న పాపా

దులు ఆది శబ్దముచేత పుష్ప మాలికాంబరాభరణచందన తాంబూలాంగనాలింగనము మొదలగునవి చెప్పబడుచున్నవి. ముముక్షువులకు విరోధి సంసారసంబంధము. అనగా దుష్ట వ్యాపారము, అసత్యజ్ఞానము, మలినదేహము గలవారై విభూతియందుండుట. అపేక్షితము భగవదనుభవమున కనుకూలమైన పరమపదమును బొందుట. నిత్యులకును ముక్తులకును విరోధి భగవత్సన్నిధిని జేయు కైంకర్యమునకు వచ్చువిచ్ఛేదము. అపేక్షితము ఉత్తరోత్తరా కైంకర్యవృద్ధి.

38. ఈశ్వరునికంటె మిగిలినవారు రక్షకులుగారాయను సంశయము ప్రపన్నపరిత్రాణమను గ్రంథములో హేతువులతో విస్తరించి చెప్పబడినది.

39. రక్షించునప్పుడు పురుషకారభూతురాలగు పిరాట్టి సన్నిధి కావలసియుండుట చేత నీ (అ) కారమునందు శ్రీసంబంధము ననుసంధించుకొన వలయును.

40. శ్రీశబ్దమునకు భగవంతుని నిత్యము విడువకుండ ఆశ్రయించి యుండుననియు, చేతనులచేతను నిత్యము సేవింపబడుచుండుననియు నర్థము.

41. భగవంతుని వక్షస్థలమందు నిత్యము వసియించి యుండునట్టి యాపిరాట్టి ఆవక్షస్థలమును విడిచినగదా ఆయనను జెప్పుచున్న యీ (అ) కారమును విడుచునని, జ్ఞానాధికులైన సేనాపతి జయ్యరుగారు సాయించిరి.

42. పతివ్రతయగు స్త్రీ పాతివ్రత్యధర్మమునకు దగినట్లుగా దన పెనిమిటిని సంతోష పెట్టుటకు యీయన యొక్క పడకనున్న తనరక్షకత్వధర్మమునకు దగినట్లుగా తన సంతానమునకు స్తన్యమిచ్చుట మొదలగు నుపచారములు జేసి కాపాడుటకు వారి తోట్లనున్న విడువకుండునట్లు, యీ పిరాట్టియును తనకు భర్తయైన సర్వేశ్వరుని చెప్పుచున్న (అ) కారమును దన సంతానములైన జీవులను జెప్పు (మ) కారమును విడువ కుండును.

43. యశోదాదేవి తన పెనిమిటియైన నందునిన్ని కుమారుడగు శ్రీకృష్ణునిన్ని విడువక వారల మధ్యను ఆ పిరాట్టి వలె నుండునది. ఈ [అ] కారమందు శబ్దమును పట్టుబట్టి యొక్క ఈశ్వర శేషత్వమునే చెప్పినను, లక్ష్మీ శేషత్వముగూడా లోకప్రసిద్ధమై తప్పకవచ్చును. యెట్లనగా, ఒక నొకరొక యజమానునియొద్ద నౌకరుండుటకు నిశ్చయించుకొని దస్తావేజు వ్రాసియిచ్చునపు డతని యాజ్ఞానుసారముగా బనిజేతునని వ్రాసియుండిన్ని, ఆయన భార్యయొక్క ఆజ్ఞానుసారముగా నౌకరి చేయడా !

45. కాబట్టి సర్వేశ్వరుని పిరాట్టి విడిచియుండదు.

46. అందుకు దృష్టాంతములు. సూర్యుని తేజస్సు విడిచియుండనట్లున్ను, పుష్పమును బరిమళము విడిచియుండనట్లున్ను స్వామిని పిరాట్టి విడచియుండదు.

47. కాఁబట్టి లక్ష్మీదేవితోఁగూడిన స్వామియందే భక్తి జేయవలెను. ఉభయులయందు భక్తి చేయుటచేతనే కదా బాగుపడును.

48. ఈ (అ) కారమందు సంస్కృతవ్యాకరణసూత్రముచేత చతుర్థీవిభక్తి కనబడకుండ లోపించి యా చతుర్థ్యర్థమును మాత్రము ఇచ్చును.

49. ప్రతిశబ్దమునకు నేడేసి విభక్తులుండఁగా నీ శబ్దమునకు మాత్రమిచ్చుట చతుర్థీవిభక్తినిచ్చుటకు కారణమేమనగా,

50. (నారాయణాయ) యను చతుర్థ్యంతమైన యాపదమునకు (అ) కారము సంగ్రహమై యుండుటచేత నీ (అ) కారమునకు గూడ చతుర్థీవిభక్తి కావలెను.

51. యీ చతుర్థి 'వీనికొఱకు' అను యర్థ మిచ్చి తాదర్థ్య చతుర్థి యగుటచేత నీశ్వరుని కీ జీవుడు శేషమను నర్థమును దెల్పుచున్నది. శేషత్వమనగా దాసత్వము.

52. శేషత్వము దుఃఖరూపమైనదిగాను కదా లోకమందు గనబడుచున్నది యంటిరేని,

53. శేషత్వములు యావత్తు దుఃఖరూపమైన వనుటనియమము లేదు. చక్రవర్తులు మహారాజులు మొదలయిన ప్రభువులసన్నిధిని, గొప్ప యధికారుల సన్నిధినిన్ని చేయు శేషవృత్తులు ప్రపంచమందు సుఖముగాను గౌరవముగాను నుండుట లేదా ?

54 ప్రభువు విషయమైన శేషత్వము వారి ఐశ్వర్యాది గుణమునుబట్టి వచ్చినది గనుక సుఖరూపమున్నైనదని యంటి శేష, ఈశ్వరునియొక్క రక్షకత్వమును జెప్పుచున్న (అ) కారమందు రక్షణమునకు కావలసిన కల్యాణగుణములున్ను యున్నవి. గనుక నీశ్వరుని విషయమునఁగల శేషత్వమున్ను ఆ గుణములనుబట్టి సుఖతరముగానే యుండును.

55. ఆత్మకు స్వరూపమున్ను భగవద్దాసత్వరూపమైన శేషత్వమే. సమస్తమైన ఆత్మలును పరమాత్మకు శేషభూతులని యనేక ప్రమాణములు జెప్పుచున్నవి.

56. ఆత్మలకును పరమాత్మకును జ్ఞానానందామలత్వములు సమానముగానున్నప్పటికిన్ని. పరమాత్మకు స్వామిత్వమే ప్రధానస్వరూపమైనట్లు, ఆత్మకు భగవద్దాస్యరూపమైన శేషత్వమే ప్రధానస్వరూపముగాబట్టి యిట్లు శేషత్వములేనప్పుడు ఆత్మకు స్వరూపమే లేకపోవును.

57. ఆత్మలకు స్వాభావికమైన శేషత్వము నంగీకరించక తానుస్వతంత్రుడను తలంపే యాత్మాపహారమనబడును. ఇట్టి స్వతంత్రముబుట్టిన వెంటనే ఆత్మ నశించుననగా స్వరూపములేని దానివలెనే యగును.

58. (ఓం) అనే ప్రణవమందు (ఉ) కారము (వానిశే) అను అవధారణార్థమును జెప్పుచున్నది. (తదేవభూతంతదుభవ్యమాఇదం) ఇత్యాది శ్రుతులయందు ఏవకారస్థానమందు (ఉ) కారముండియుండి ఆ (ఉ) కారము ఏవకారార్థము నేయిచ్చును.

59. ఏవకారార్థము జెప్పుచున్న (ఉ) కార మీశ్వరునికే తప్ప తదితరుల కీయాత్మ శేషముగాదని అన్యశేషత్వమును దీసివేయుచున్నది.

60. (ఉ] కారము లక్ష్మీ వాచకముగా పాంచరాత్ర గ్రంథమందు చెప్పబడుటచేత [అ] కారమందు భగవచ్ఛేషత్వమునున్ను [ఉ] కారమందు లక్ష్మీ శేషత్వమునున్ను కొందరు చెప్పుదురు.

61, లక్ష్మీ శేషత్వము జెప్పుటకంటె ఇదివరలో [అ] కారములో వచ్చిన లుప్తచతుర్థివల్ల చెప్పబడిన భగవచ్ఛేషత్వమునకును విరోధి యైన అన్య శేషత్వము దీసివేయుట ఆవశ్యక మైనది,

62. ఇంద్రాది దేవతలకు భోగ్యమగు యజ్ఞమందు హోమముల జేయు బురోడాశమును కుక్కకిడినట్లు భగవదేక శేషమగు నీయాత్మను సంసారులకు శేషముగా జేయుట బహునింద్యము.

63. ఇదివరలో జెప్పిన లక్ష్మీశేషత్వముకంటె ప్రధానమై యుండుటయేగాక, భగవచ్ఛేషత్వమునకంటెనున్ను అన్యశేషత్వనివృత్తి ముఖ్యమైయున్నది

64. యమకింకర సంవాదమును పాడించిన తిరుముడిశి యాళ్వారులు భాగవతుల లక్షణమును జెప్పుచు భగవంతుని

మఱచియును, అన్య శేషత్వము లేని మనుష్యులైతే చాలునని సాయించినారు.

65. ఈ (ఉ) కార మాత్మ తనకు బరులకుకూడా శేష ముకా దొక భగవంతునికే యను నర్థముఁ దెల్పుచున్నది.

66. (క) వర్గముచేత పంచభూతములనగా పృథ్వీజల వహ్నివాయ్వాకాశములు జెప్పబడును. (చ) వర్గముచేత కర్మేంద్రియములనగా వాక్పాణి పాదపాయూపస్థలు జెప్ప బడును. (ట)వర్గము జ్ఞానేంద్రియములనగా త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణముల నైదింటిని జెప్పును. [త] వర్గము గంధాది విషయములనగా శబ్ద స్పర్శ రూప రస గంధము లైదింటిని పృథివ్యాది భూతగుణములుగా జెప్పును. [ప] కారముచే మనస్సున్ను [ఫ] కారముచే అహంకారమున్ను [బ] కారము చేత మహత్తత్వమున్ను [భ] కారముచేత ప్రకృతి తత్వ మున్ను జెప్పబడును. ఇట్లిరువదినాల్గక్షరములచేత ఇరువది నాల్గు తత్వములు జెప్పబడి యిరువదియైదవ యక్షరమైన [మ] కారముచేత యిరువదియైదవ తత్వమయిన జీవుడు జెప్పబడుట చేతనున్ను యీ [మ] కారము [మన జానే] యను ధాతువును బట్టి జ్ఞానమును జెప్పునదై యుండుటచేతనున్ను జ్ఞానమే స్వరూపముగాఁగల జీవుడు చెప్పబడుచున్నాడు.

67. ఈ [మ] కారము బద్ధముక్తనిత్యరూపముగా నున్న సకల జీవసమూహమును జెప్పును. (ఏకవచనము జీవ

సమూహ మెట్లు జెప్పునంటే ధాన్యము మొదలగు సమూహ వాచకములం దేకవచనమే సమూహమును జెప్పును.

68. కాబట్టి యిక్కడకూడా [మ] కారము జీవ సమూహమును జెప్పును. దీనిని జాత్యేకవచనముగా వాడు కొందురు.

69. ఈ [మ] కారముచేత శేషత్వమే స్వరూపముగా జెప్పబడిన ఆత్మ జ్ఞానానందములు గూడా లక్షణముగా గలవా డని చెప్పబడుచున్నాడు. దీనిచేత దేహముకంటె యాత్మ వేరని చెప్పబడుచున్నది.

70. ఆత్మ దేహముకంటె వేరను యంశము తత్వశేఖర మను గ్రంథమున సయుక్తికముగాఁ జెప్పబడి యున్నది.

71. పరిమళముండబట్టి పుష్పమున్ను, కాంతి యుండబట్టి రత్నమున్ను ఏలాగున నాదరింపబడుచున్నవో, యీలాగుననే శేషత్వ ముండుటచేత నాత్మయు నాదరింపబడుచున్నది. కాబట్టి శేషత్వము లేనప్పుడు కేవల మాత్మస్వరూపముతో ప్రయోజనము లేదు. ఈ శేషత్వముయొక్క యావశ్యకతను జూపించుటకయ్యే [మ] కారములో జెప్పబడిన జీవస్వరూపముఁ దెలియఁజేయుటకుం ముందుగనె [అ] కారములో లోపించి యున్న చతుర్థిచేత శేషత్వము జెప్పఁబడినది.

72. తిరుక్కణ్ణపురమనే గ్రామమందు వేంచేసిన స్వామికే శేషభూతుడ నింకొకరికి శేషభూతుడను గానని

తిరుమంగై యాళ్వార్లు సాయించిన పాశురప్రకారముగా ప్రణవముచేత జీవేశ్వరులకు శేషశేషిసంబంధము జెప్పబడినది.

73. పద్మమందు నివసించియుండు లక్ష్మీదేవినాథుడగు స్వామి నొక్కనినే నాజ్ఞానముజూచునని పొయిగై యాళ్వారులు సాయించిన శ్రీసూక్తిప్రకారముగా లక్ష్మీసమేతుడైన శ్రియఃపతికే సర్వాత్మలును శేషమై యుండుననుయర్థమీ ప్రమాణమునందు జెప్పబడుచున్నది.

74. (అ) కారముచేత రక్షకుడైన సర్వేశ్వరుడు జెప్పబడుచున్నాడు. (మ) కారముచేత రక్షింపబడుజీవుడు జెప్పబడుచున్నాడు. (అ) కారమందున్న లుప్త చతుర్థిచేత రక్షణకు కారణమైన జీవేశ్వరులకున్న సంబంధము జెప్పబడుచున్నది. (ఉ) కారముచేత రక్షణాఫలము జెప్పబడుచున్నది. రక్షణకు ఫలము న్యులకు బనికిరాక యీశ్వరునకే యర్హమై యుండుట. దీని ననన్యార్హత్వమని చెప్పుదురు.

75. ఇకమీాద ప్రణవార్థవివరణము జెప్పంబడుచున్నది.

76. ఈ ప్రణవములోనున్న (ఉ) కారముయొక్క యర్థము (నమః) పదముచేత బహుళముగా జెప్పబడుచున్నది. అకారముయొక్క యర్థము "నారాయణ" పదముచే వివరింపంబడుచున్నది. (మ) కారముయొక్క యర్థము (నారాయణ) పదమునందుండు చతుర్థీ విభక్తిచేత విస్తరింపబడుచున్నది. ఈ (మ) కారముయొక్క యర్థము (నార) పదముచేతకూడా వివరింపబడునని చెప్పుదురు.

77 ఈ మంత్రములోనుండు (అ) కారమును ముందుగా వివరించి తరువాత (ఉ) కారమును వివరించవలసియుండగా నిట్లు వివరించకపోవుటకు కారణ మేమనగా (అ) కార వివరణమైన (నారాయణ) పదమందు జెప్పబడు భగవత్కైంకర్యమునకు విరోధులైనయహంకార మమకారములు నశించితేగాని ఈ భగవత్కైంకర్యము రుచింపదు. గనుక (నమః) పదముచేత నా విరోధులను బోగొట్టుటకై (ఉ) కారమును ముందుగా వివరించినారు.

78. (నమః) పదమందు (న) అనియు (మః) అనియు రెండు పదములు గలవు (మః) షష్ఠ్యంత పదము (నాకు) అను నర్థమును జెప్పి శేషత్వమునకుం బ్రతికోటియైన స్వాతంత్ర్యమును జెప్పుచున్నది.

79. (న) యను పదము (కాదని) నిషేధవాచియగుట చేతను [మ] కారములో జెప్పబడీన స్వాతంత్ర్యమును దీసి వేయు చున్నది.

80. [నమః] యను రెండుపదములు గలసి ఆత్మ తనకు దాను శేషభూతుడుగాడు స్వతంత్రుడును గాడను నర్థము జెప్పుచున్నవి.

81. స్వశేషత్వ అన్యశేషత్వములను రెంటిని దీసివేయు చున్న [ఉ] కారమునకు వివరణమైన యీ [నమః] పదమందన్యశేషత్వమును దీసివేయక స్వశేషత్వమును మాత్రము దీసి

చేయుటను హేతువేమంటే అన్య శేషత్వమును యీశ్వరుడు దన కల్యాణగుణములను జూపించి నివర్తింపజేయుట కవకాశ మున్నది; నాకే నేను శేష మన్నప్పుడట్టి యవకాశము లేదు. గనుక నన్య శేషత్వమునకంటె స్వశేషత్వము క్రూరమైనది. కాబట్టి దానినిమాత్రమే దీసి వేయుచున్నది.

82. ఈ [నమః] పదముచేత యాత్మ ముక్తినిబొందు టకు గల్గియున్న విరోధులు బోగొట్టబడుచున్నవి.

83. ఆ విరోధులు మూడు.

84 అవి యేవనగా ఒకటి ప్రణవమందు జెప్పుచున్న శేషత్వస్వరూపమునకుండు విరోధియును. రెండు యీ (నమః) పదమందు జెప్పుచున్న భగవ దేకోపాయత్వ స్వరూపమున కుండు విరోధియును. మూడు [నారాయణ] పదమందు జెప్పు చున్న ప్రాప్యస్వరూపమునకుండు విరోధియును.

85. ఈ విరోధులు పోవడమనగా నేమనగా స్వరూప విరోధి యనునది [నేను నాది] యను అహంకార మమకార ములే యగుటచేత వాటినివిడిచి నేను నీకు పరతంత్రుడను నా సంబంధముగల వస్తువులు నీకు పరతంత్రములని యాత్మా త్మీయములను భగవత్సన్నిధిని సమర్పించియుండుటయే స్వరూప విరోధిపోవుట. రెండు ఉపాయ విరోధియనునది తన రక్షణ విషయమై దానుస్వతంత్రించి యుండుటచేతను దానినివిడుచు కొని తన రక్షణభారమును సర్వేశ్వరునియం దుంచుటయే

లైనవి. పురుషార్థమనగాఁ బురుషులచేత కోరబడినది. అది అయిదు విధములు. ఒకటి ధర్మము. రెండు అర్థము. మూడు కామము. నాల్గు ఆత్మానుభవము. అయిదు భగవదనుభవము. ఒకటి ధర్మమనగా ప్రాణిరక్షణమున కుపయోగముగా జేయు పనులు, రెండు అర్థమనగా వర్ణాశ్రమముల కుచితముగా ధన ధాన్యాదులను సంపాదించి దేవతావిషయముల యందును పైతృక కర్మలయందును బ్రాహ్మణులయందును దేశకాల పాత్రముల నెఱిగి ధర్మబుద్ధితో ఖర్చు పెట్టినది. మూడు కామమనఁగా నిహపరలోకములయందు అనుభవించు సుఖవిశేషము. ఇహలోకసుఖమనఁగా జననీజనక భార్యా పుత్ర మిత్ర శత్రు ధన ధాన్య గృహక్షేత్ర వస్త్రచందన పుష్ప తాంబూ లాన్నపానాదుల యనుభవమువలన గల్గుసుఖము. పరలోక సుఖమనగా నిహలోకముకన్నా విలక్షణమైన స్వర్గాది లోకములకుఁ బోయి ఆకలి దప్పిక దుఃఖము ముసలితనము మరణము మొదలగునవి లేక, సంపాదించిన పుణ్యమునకుఁ దగినట్లు అమృతపానము జేసి రంభాది అప్సరాదులతో సుఖించుట. నాల్గు ఆత్మానుభవమనగా శోకనివృత్తిమాత్రమగు కేవలాత్మానుభవము అయిదు భగవదనుభవమనగా జీవుడు జేసిన భక్తి ప్రపత్తులవల్ల పుణ్యపాపములను నశింప జేసి, మూర్ధన్యనాడీద్వారా ఈ శరీరమును విడిచి, యర్చిరాదిమార్గమున పరమపదముకుఁ బోయి శుద్ధసత్వదేహమును బొంది లక్ష్మీభూ నీళానాయకుడగు శ్రీమన్నా

రాయణుని నిత్యసేవ చేయుచుండుట. నాల్గు ఉపాయస్వరూప
మనగా భగవత్ప్రాప్తినిగలుగజేయు సాధనస్వరూపము. ఇది
యైదువిధములు. ఒకటి కర్మము, రెండు జ్ఞానము, మూడు
భక్తి, నాల్గు ప్రపత్తి, అయిదు ఆచార్యాభిమానము. ఇందు
లో కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తుల వివరణము. (21-22) సంఖ్యలు
గలవాక్యములలో చేయబడినది. ఆచార్యాభిమానమనగా చే
తనుడు, కర్మజ్ఞానభక్తి ప్రపత్తులయందు నశక్తుడై యుండున
ప్పుడు, వీని యందు గనికరించి, వీని లాభమునకై భగవత్సన్నిధి
నిప్రపత్తి జేసి, వీనిజ్జీవింపఁ జేయువారై జ్ఞానానుష్ఠాన సంపన్ను
లగు నాచార్యుల యభిమానమునకు పాత్రుడై యుండుట. ఇది
రెండువిధములు, ఒకటి స్వగతస్వీకారము, రెండు పరగతస్వీ
కారము, స్వగత స్వీకారమనగా, చేతనుడు ఆశ్రయించిన పైని
ఆచార్యు డభిమానించి స్వీకరించుట. పరగత స్వీకారమనగా,
తా నాశ్రయించకపోయినను, ఆచార్యు డభిమానించి స్వీకరిం
చుట. అయిదు విరోధిస్వరూపమనగా, చేతను డపేక్షించు లా
భమునకు విరోధించినది. ఇది అయిదు విధములు, ఒకటి స్వస్వ
రూపవిరోధి, రెండు పరస్వరూప విరోధి, మూడు పురుషార్థస్వ
రూపవిరోధి, నాల్గు ఉపాయస్వరూపవిరోధి, అయిదు ప్రాప్తి
విరోధి, స్వస్వరూప విరోధియనఁగా దేహమే యాత్మయనుభ్ర
మయును, భగవదితరులకు శేషభూతుఁడనను భ్రమయును,
స్వస్వాతంత్ర్యమును. రెండు పరస్వరూపవిరోధి యనగా, దేవ

తాంతరములయందు పరత్వబుద్ధియును, దేవతాంతరముల యందు భగవంతునితో సమానబుద్ధియును, క్షుద్రదేవతాదు లందు మహత్త్వబుద్ధియును, భగవదవతారములయందు మానుషప్రతిపత్తియును, అర్చావతారమునందు సశక్తిప్రతిపత్తి యును. మూడు పురుషార్థ విరోధియనగా, భగవత్కైంకర్య రూప ఫలమునకంటె యితరమైన ఐశ్వర్య ఫలములను గోరుటయు, భగవంతునియొక్క ఇష్టానిష్టములను విచారింపక తన కిష్టమువచ్చిన కైంకర్యమును జేయుటయును. నాల్గు ఉపాయ విరోధి యనగా. ప్రపత్తికంటె నన్యములైన భగవత్ప్రాప్త్యుపాయములందు వైలక్షణ్య ప్రతిపత్తి. అనగా, ఆధిక్యబుద్ధియును ప్రపత్త్యుపాయము సులితముగాఁ జేయదగినది కాబట్టిన్ని, దీని చేత బొందవలసిన ఫలము గొప్పది కాబట్టిన్ని, ఈ ఫలము బొందుటకు విరోధులై మనము చేసుకున్నట్టి పాపములధికములు గాబట్టిన్ని ఈప్రపత్తివల్ల నింతఫలము గలుగునో లేదో యను సంశయమున్ను. అయిదు ప్రాప్తివిరోధియనగా, భాగవతుల విషయమైనను, ఆచార్యులవిషయమైనను, వారికి శిష్యులై తన తోసబ్రహ్మచారులగు వారివిషయమైనను జేయువపచారములు.

24. పూర్వాచార్యు లీమంత్రమందర్థము దెలియుటకు మునుపు తాము బుట్టినవారుగా దలంచి యుండరైరి. దీని యందైన యర్థజ్ఞానము గల్గినవెనుక నీమంత్రార్థముతో గాక వేఱొకదానితో కాలమును బుచ్చి యుండరు.

25. మంత్రార్థమక్కఱలేకుండ, మంత్రమేతన్నుచ్చరించిన మాత్రముచేతనే సమస్తఫలముల నిచ్చునదియైయుండగా, మంత్రమునకంటె యర్థమందే పూర్వాచార్యులందఱును నాసక్తి గలిగియుండుటకు హేతు వేమనగా, వీరు కోరుఫలము భగవంతుడగుటచేత నీఫలమునిచ్చువాడు భగవంతుడగుటచేతను, ఈ మంత్రార్థము భగవదేకోపాయ మగుటచేతను అర్థమందే ఆసక్తిగలవారై యుండిరి.

26. ఈమంత్రమునం జెప్పఁబడుచున్న యర్థము (ఓం) అను ప్రణవముచేత జీవులయొక్క శేషత్వమున్ను (నమః) అను పదముచేత జీవునియొక్క పారతంత్ర్యమున్ను ఈ రెండుపదములుగలసి జీవునియొక్క శేషత్వపారతంత్ర్య స్వరూపములను జెప్పుచున్నవి. (నారాయణాయ) అను పదముచేత జీవుడు భగవంతుని విషయమై జేయవలసిన కైంకర్యరూపమైన ఫలము జెప్పబడుచున్నది. ప్రణవముచేత జీవుని శేషత్వమును, నమః శబ్దముచేత భగవదేకోపాయమును, నారాయణాయ పదముచేత కైంకర్యమున్ను జెప్పఁబడుచున్నవి.

27. జీవుడు బొందవలసిన ఫలముయొక్క వివరము ప్రమేయశేఖరమను గ్రంథములోనున్ను అర్చిరాదియను గ్రంథములోనున్ను చెప్పబడియున్నది. ఈ యాత్మ అర్చిరాదిమార్గముగా బరమపదమునకుంబోయి పరిపూర్ణ భగవదనుభవము జేసినందున గలిగినప్రీతిచేత ప్రేరణ జేయబడినవాడై భగవం

తుని విషయమై జేయు సర్వవిధ కైంకర్యములే ఫలముగాని గ్రంథములయందు జెప్పబడుచున్నది.

28. ఈ మంత్ర మెనిమిదక్షరములు మూడుపదములు గలదై యుండును. (ఓం) అను నొకయక్షరము (నమః) అనునది రెండక్షరములు (నారాయణాయ) ఐదక్షరములు. ఈమంత్రము నారాయణోపనిషత్తునం దష్టాక్షరిగాం జెప్పంబడుచున్నది.

29. ఈ మూడుపదములున్ను మూడర్థములను జెప్పు చున్నవి. ఇవియేవనగా—శేషత్వమున్ను పారతంత్ర్యమున్ను కైంకర్యమున్ను.

30. ఇందులో మొదటిపదము ప్రణవము.

31. ఇది (అ) కార (ఉ) కార (మ) కారముతో గలసి (ఓం) అని పలుకబడుచున్నది.

32. బ్రహ్మ వేదాధ్యయనముజేయు సమయమందు ఋగ్వేదమువలన (భూః) యను వ్యాహృతియును, యజుర్వే దమువలన (భువః) యను వ్యాహృతియును, సామవేదమువలన (సువః) యను వ్యాహృతియును దఱచిచూడగా వీటిలోనుండి అకార ఉకార మకారములను మూడక్షరములు క్రమముగా బుట్టినవి.

33. కాబట్టి యీ ప్రణవము సకల వేదసారమని చెప్పబడినది.

34. ఇంను (అ) కారము సర్వశబ్దములకున్ను కార ణమై నారాయణ శబ్దమునకు సంగ్రహమై యుండుటచేత సకల జగత్తుకున్ను కారణమై సర్వరక్షకుడై యున్న ఈశ్వ రుని జెప్పుచున్నది. (అ) కారము సమస్త శబ్దములకు గారణ మగుటవలనను యీశ్వరుడు సమస్తవస్తువులకుఁ గారణమగు టవలనను (అ) కారముచే భగవంతునియొక్క సర్వకారణత్వము జెప్పబడుచున్నది. "అవ రక్షణే" యను ధాతువు వల్లగలిగినం దున భగవంతునియొక్క సర్వరక్షకత్వమునున్ను జెప్పుచున్నది.

35. రక్షించుట యనగా విరోధిని బోగొట్టుటయున్ను అపేక్షితముల నిచ్చుటయున్ను.

36. సంసారులకు విరోధి శత్రుపీడాదులు అనగా తాప త్రియమువల్ల గలుగు పీడలు. తాపత్రయమనగా ఒకటి ఆధ్యాత్మి కము. రెండు ఆధిదైవికము. మూడు ఆధిభౌతికము. ఆధ్యా త్మికము రెండువిధములు. ఒకటి శారీరకము, రెండుమానసికము. ఒకటి శారీరకమనగా శరీరమునుసంభవించు బహువిధవ్యాధులు. రెండు మానసికమనగా కామ క్రోధ లోభ మోహమదమాత్స ర్యవిషాదశోకావమానాసూయాదులగు మనోవ్యాధులు. రెండు ఆధిదైవికమనగా చలిగాలియెండవానపిడుగులు మొదలగువాటి వల్లబుట్టు తాపము. మూడు ఆధిభౌతికమనగా పశుపక్షిపిశాచ మానుష సర్పరాక్షస క్షుద్రజంతువులు మొదలగు వాటివలన గల్గు తాపములనఁగా పీడలు. సంసారుల కపేక్షితములన్న పానా

దులు ఆది శబ్దముచేత పుష్ప మాలికాంబరాభరణచందన తాంబూలాంగనాలింగనము మొదలగునవి చెప్పబడుచున్నవి. ముముక్షువులకు విరోధి సంసారసంబంధము. అనగా దుష్ట వ్యాపారము, అసత్యజ్ఞానము, మలినదేహము గలవారై విభూతియందుండుట. అపేక్షితము భగవదనుభవమున కనుకూలమైన పరమపదమును బొందుట. నిత్యులకును ముక్తులకును విరోధి భగవత్సన్నిధిని జేయు కైంకర్యమునకు వచ్చువిచ్ఛేదము. అపేక్షితము ఉత్తరోత్తరా కైంకర్యవృద్ధి.

38. ఈశ్వరునికంటె మిగిలినవారు రక్షకులుగారాయను సంశయము ప్రపన్నపరిత్రాణమను గ్రంథములో హేతువులతో విస్తరించి చెప్పబడినది.

39. రక్షించునప్పుడు పురుషకారభూతురాలగు పిరాట్టి సన్నిధి కావలసియుండుట చేత నీ (అ) కారమునందు శ్రీసంబంధము ననుసంధించుకొన వలయును.

40. శ్రీశబ్దమునకు భగవంతుని నిత్యము విడువకుండ ఆశ్రయించి యుండుననియు, చేతనులచేతను నిత్యము సేవింపబడుచుండుననియు నర్థము.

41. భగవంతుని వక్షస్థలమందు నిత్యము వసియించి యుండునట్టి యాపిరాట్టి ఆవక్షస్థలమును విడిచినగదా ఆయనను జెప్పుచున్న యీ (అ) కారమును విడుచునని, జ్ఞానాధికులైన సేనాపతి జయ్యరుగారు సాయించిరి.

42. పతివ్రతయగు స్త్రీ పాతివ్రత్యధర్మమునకు దగినట్లుగా దన పెనిమిటిని సంతోష పెట్టుటకు యీయన యొక్క పడకనున్ను తనరక్షకత్వధర్మమునకు దగినట్లుగా తన సంతానమునకు స్తన్యమిచ్చుట మొదలగు నుపచారములు జేసి కాపాడుటకు వారి తోట్లనున్ను విడువకుండునట్లు, యీ పిరాట్టియును తనకు భర్తయైన సర్వేశ్వరుని చెప్పుచున్న (అ) కారమును దన సంతానములైన జీవులను జెప్పు (మ) కారమును విడువ కుండును.

43. యశోదాదేవి తన పెనిమిటియైన నందునిన్ని కుమారుడగు శ్రీకృష్ణునిన్ని విడువక వారల మధ్యను ఆ పిరాట్టి వలె నుండునది. ఈ [అ] కారమను శబ్దమును పట్టుబట్టి యొక్క ఈశ్వర శేషత్వమునే చెప్పినను, లక్ష్మీ శేషత్వ ముగూడా లోకప్రసిద్ధమై తప్పకవచ్చును. యెట్లనగా, ఒక నౌక రొక యజమానునియొద్ద నౌకరుండుటకు నిశ్చయించు కొని దస్తావేజు వ్రాసియిచ్చునపు డతని యాజ్ఞానుసారముగా బని జేతునని వ్రాసియుండిన్ని, ఆయన భార్యయొక్క ఆజ్ఞాను సారముగా నౌకరి చేయడా !

45. కాబట్టి సర్వేశ్వరుని పిరాట్టి విడిచియుండదు.

46. అందుకు దృష్టాంతములు. సూర్యుని తేజస్సు విడిచియుండనట్లున్ను, పుష్పమును బరిమళము విడిచియుండ నట్లున్ను స్వామిని పిరాట్టి విడచియుండదు.

47. కాఁబట్టి లక్ష్మీదేవితోఁగూడిన స్వామియందే భక్తి జేయవలెను. ఉభయులయందు భక్తి చేయుటచేతనే కదా బాగుపడును.

48. ఈ (అ) కారమందు సంస్కృతవ్యాకరణసూత్రముచేత చతుర్థీవిభక్తి కనబడకుండ లోపించి యా చతుర్థ్యర్థమును మాత్రము ఇచ్చును.

49. ప్రతిశబ్దమునకు నేడేసి విభక్తులుండఁగా నీ శబ్దమునకు మాత్రమిచ్చుట చతుర్థీవిభక్తినిచ్చుటకు కారణమేమనగా,

50. (నారాయణాయ) యను చతుర్థ్యంతమైన యాపదమునకు (అ) కారము సంగ్రహమై యుండుటచేత నీ (అ) కారమునకు గూడ చతుర్థీవిభక్తి కావలెను.

51. యీ చతుర్థి 'వీనికొఱకు' అను యర్థమిచ్చు తాదర్థ్య చతుర్థి యగుటచేత నీశ్వరునికీ జీవుడు శేషుడను నర్థమును దెల్పుచున్నది. శేషత్వమనగా దాసత్వము.

52. శేషత్వము దుఃఖరూపమైనదిగాను కదా లోకమందు గనబడుచున్నది యంటివేని,

53. శేషత్వములు యావత్తు దుఃఖరూపమైన వనుటనియమము లేదు. చక్రవర్తులు మహారాజులు మొదలయినప్రభువులసన్నిధిని, గొప్ప యధికారుల సన్నిధినిన్ని చేయు శేషవృత్తులు ప్రపంచమందు సుఖముగాను గౌరవముగాను నుండలేదా ?

54 ప్రభువు విషయమైన శేషత్వము వారి ఐశ్వర్యాది గుణమునుబట్టి వచ్చినది గనుక సుఖరూపమున్నైనదని యంటి రేని, ఈశ్వరునియొక్క రక్షకత్వమును జెప్పుచున్న (అ) కారమందు రక్షణమునకు కావలసిన కల్యాణగుణములున్ను యున్నవి. గనుక నీశ్వరుని విషయమునఁగల శేషత్వమున్ను ఆ గుణములనుబట్టి సుఖతరముగానే యుండును.

55. ఆత్మకు స్వరూపమున్ను భగవద్దాసత్వరూపమైన శేషత్వమే. సమస్తమైన ఆత్మలును బరమాత్మకు శేషభూతులని యనేక ప్రమాణములు జెప్పుచున్నవి.

56. ఆత్మలకును బరమాత్మకును జ్ఞానానందామలత్వములు సమానముగానున్నప్పటికిన్ని. బరమాత్మకు స్వామిత్వమే ప్రధానస్వరూపమైనట్లు, ఆత్మకు భగవద్దాస్యరూపమైన శేషత్వమే ప్రధానస్వరూపముగాబట్టి యిట్లు శేషత్వములేనప్పుడు ఆత్మకు స్వరూపమే లేకపోవును.

57. ఆత్మలకు స్వాభావికమైన శేషత్వము నంగీకరించక తానుస్వతంత్రుడను తలంపే యాత్మాపహారమనబడును. ఇట్టి స్వతంత్రముబుట్టిన వెంటనే ఆత్మ నశించుననగా స్వరూపములేని దానివలెనే యగును.

58. (ఓం) అనే ప్రణవమందు (ఉ) కారము (వానికే) అను అవధారణార్థమును జెప్పుచున్నది. (తదేవభూతంతదు భవ్యమాఇదం) ఇత్యాది శ్రుతులయందు ఏవకారస్థానమందు (ఉ) కారముండియుండి ఆ (ఉ) కారము ఏవకారార్థము నేయిచ్చును.

59. ఏవకారార్థము జెప్పుచున్న (ఉ) కార మీశ్వరునికే తప్ప తదితరుల కీయాత్మ శేషముగాదని అన్య శేషత్వమును దీసివేయుచున్నది.

60. (ఉ] కారము లక్ష్మీ వాచకముగా పాంచరాత్రి గ్రంథమందు చెప్పబడుటచేత [అ] కారమును భగవచ్ఛేషత్వమునున్ను [ఉ] కారమును లక్ష్మీ శేషత్వమునున్ను కొందరు చెప్పుదురు.

61, లక్ష్మీ శేషత్వము జెప్పుటకంటె ఇదివరలో [అ] కారములో వచ్చిన లుప్తచతుర్థివల్ల చెప్పబడిన భగవచ్ఛేషత్వమునకును విరోధి యైన అన్య శేషత్వమును దీసివేయుట ఆవశ్యక మైనది,

62. ఇంద్రాది దేవతలకు భోగ్యమగు యజ్ఞమందు హోమములజేయు బురోడాశమును కుక్కకిడినట్లె భగవదేక శేషమగు నీయాత్మను సంసారులకు శేషముగా జేయుట బహునింద్యము.

63. ఇదివరలో జెప్పిన లక్ష్మీశేషత్వముకంటె ప్రధానమై యుండుటయేగాక, భగవచ్ఛేషత్వమునకంటెనున్ను అన్య శేషత్వనివృత్తి ముఖ్యమైయున్నది

64. యమకింకర సంవాదమును సాయించిన తిరుముడిశి యాళ్వారులు భాగవతుల లక్షణమును జెప్పుచు భగవంతుని

మఱచియును, అన్య శేషత్వము లేని మనుష్యులైతే చాలునని సాయించినారు.

65. ఈ (ఉ) కారము మాత్మ తనకు బరులకుకూడా శేషముకా దొక భగవంతునికే యను నర్థముఁ దెల్పుచున్నది.

66. (క) వర్గముచేత పంచభూతములనగా పృథ్వీజల వహ్నివాయ్వాకాశములు జెప్పబడును. (చ) వర్గముచేత కర్మేంద్రియములనగా వాక్పాణి పాదపాయూపస్థలు జెప్పబడును. (ట)వర్గము జ్ఞానేంద్రియములనగా త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణముల నైదింటిని జెప్పును. [త] వర్గము గంధాది విషయములనగా శబ్ద స్పర్శ రూప రస గంధము లైదింటిని పృథివ్యాది భూతగుణములుగా జెప్పును. [ప] కారముచే మనస్సున్ను [ఫ] కారముచే అహంకారమున్ను [బ] కారముచేత మహత్తత్వమున్ను [భ] కారముచేత ప్రకృతి తత్వమున్ను జెప్పబడును. ఇట్లిరువదినాల్గక్షరములచేత ఇరువదినాల్గు తత్వములు జెప్పబడి యిరువదియైదవ యక్షరమైన [మ] కారముచేత యిరువదియైదవ తత్వమయిన జీవుడు జెప్పబడుటచేతనున్ను యీ [మ] కారము [మన జ్ఞానే] యను ధాతువును బట్టి జ్ఞానమును జెప్పునదై యుండుటచేతనున్ను జ్ఞానమే స్వరూపముగాఁగల జీవుడు చెప్పబడుచున్నాడు.

67. ఈ [మ] కారము బద్ధముక్తనిత్యరూపముగానున్న సకల జీవసమూహమును జెప్పును. (ఏకవచనము జీవ

సమూహ మెట్లు జెప్పునంటే ధాన్యము మొదలగు సమూహ వాచకములం దేకవచనమే సమూహమును జెప్పును.

68. కాబట్టి యిక్కడకూడా [మ] కారము జీవ సమూహమును జెప్పును. దీనిని జాత్యేకవచనముగా వారు కొందురు.

69. ఈ [మ] కారముచేత శేషత్వమే స్వరూపముగా జెప్పబడిన ఆత్మ జ్ఞానానందములు గూడా లక్షణముగా గలవా డని చెప్పబడుచున్నాడు. దీనిచేత దేహముకంటె యాత్మ వేరని చెప్పబడుచున్నది.

70. ఆత్మ దేహముకంటె వేరను యంశము తత్వశేఖర మను గ్రంథమున సయుక్తికముగా జెప్పబడి యున్నది.

71. పరిమళముండబట్టి పుష్పమున్ను, కాంతి యుండ బట్టి రత్నమున్ను ఏలాగున నాదరింపబడుచున్నవో, యాలా గుననే శేషత్వ ముండుటచేత నాత్మయు నాదరింపబడుచున్నది. కాబట్టి శేషత్వము లేనప్పుడు కేవల మాత్మస్వరూపముతో ప్రయోజనము లేదు. ఈ శేషత్వముయొక్క యావశ్యకతను జూపించుటకయ్యే [మ] కారములో జెప్పబడిన జీవస్వరూప ము దెలియజేయుటకు ముందుగనె [అ] కారములో లోపించి యున్న చతుర్థిచేత శేషత్వము జెప్పబడినది.

72. తిరుకణ్ణపురమనే గ్రామమందు వేంచేసిన స్వామికే శేషభూతుడ నింకొకరికి శేషభూతుడను గానని

తిరుమంగై యాళ్వార్లు సాయించిన పాశురప్రకారముగా ప్రణవముచేత జీవేశ్వరులకు శేషశేషిసంబంధము జెప్పబడినది.

73. పద్మమందు నివసించియుండు లక్ష్మీదేవినాథుడగు స్వామి నొక్కనినే నాజ్ఞానముజూచునని పొయిగై యాళ్వారులు సాయించిన శ్రీసూక్తిప్రకారముగా లక్ష్మీసమేతుడైన శ్రియఃపతికే సర్వాత్మలును శేషమై యుండుననుయర్థమీ ప్రమాణమునందు జెప్పబడుచున్నది.

74. (అ) కారముచేత రక్షకుడైన సర్వేశ్వరుడు జెప్పబడుచున్నాడు. (మ) కారముచేత రక్షింపబడుజీవుడు జెప్పబడుచున్నాడు. (అ) కారమందున్న లుప్త చతుర్థిచేత రక్షణకు కారణమైన జీవేశ్వరులకున్న సంబంధము జెప్పబడుచున్నది. (ఉ) కారముచేత రక్షణాఫలము జెప్పబడుచున్నది. రక్షణకు ఫల మన్యులకు బనికిరాక యీశ్వరునకే యర్హుడై యుండుట. దీని ననన్యార్హత్వమని చెప్పుదురు.

75. ఇకమీద ప్రణవార్థవివరణము జెప్పబడుచున్నది.

76. ఈ ప్రణవములోనున్న ( ఉ ) కారముయొక్క యర్థము (నమః) పదముచేత బహుళముగా జెప్పబడుచున్నది. అకారముయొక్క యర్థము "నారాయణ" పదముచే వివరింపబడుచున్నది. ( మ ) కారముయొక్క యర్థము (నారాయణ) పదమునందుండు చతుర్థీ విభక్తి చేత విస్తరింపబడుచున్నది. ఈ (మ) కారముయొక్క యర్థము (నార) పదము చేతకూడా వివరింపబడునని చెప్పుదురు.

77 ఈ మంత్రములోనుండు (అ) కారమును ముందుగా వివరించి తరువాత (ఉ) కారమును వివరించవలసియుండగా నిట్లు వివరించకపోవుటకు కారణమేమనగా (అ) కార వివరణమైన (నారాయణ) పదమందు జెప్పబడు భగవత్కైంకర్యమునకు విరోధులైనయహంకార మమకారములు నశించితేగాని ఈ భగవత్కైంకర్యము రుచింపదు. గనుక (నమః) పదముచేత నా విరోధులను బోగొట్టుటకై (ఉ) కారమును ముందుగా వివరించినారు.

78. (నమః) పదమందు (న) అనియు (మః) అనియు రెండు పదములు గలవు (మః) షష్ఠ్యంత పదము (నాకు) అను నర్థమునుజెప్పి శేషత్వమునకుం బ్రతికోటియైన స్వాతంత్ర్యమును జెప్పుచున్నది.

79. (న) యను పదము (కాదని) నిషేధవాచియగుటచేతను [మ] కారములో జెప్పబడిన స్వాతంత్ర్యమును దీసివేయు చున్నది.

80. [నమః] యను రెండుపదములు గలసి ఆత్మ తనకు దాను శేషభూతుడుగాడు స్వతంత్రుడును గాడను నర్థము జెప్పుచున్నవి.

81. స్వశేషత్వ అన్యశేషత్వములను రెంటిని దీసివేయు చున్న [ఉ] కారమునకు వివరణమైన యీ [నమః] పదమందన్యశేషత్వమును దీసివేయక స్వశేషత్వమును మాత్రము దీసి

సేయుటకు హేతువేమంటే అన్య శేషత్వమును యీశ్వరుడు దన కల్యాణగుణములను జూపించి నివర్తింపజేయుట కవకాశ మున్నది; నాకే నేను శేషమన్నప్పుడట్టి యవకాశము లేదు. గనుక నన్యశేషత్వముకంటె స్వశేషత్వము క్రూరమైనది. కాబట్టి దానినిమాత్రమే దీసి వేయుచున్నది.

82. ఈ [నమః] పదముచేత యాత్మ ముక్తినిబొందు టకు గల్గియున్న విరోధులు బోగొట్టబడుచున్నవి.

83. ఆ విరోధులు మూడు.

84 అవి యేవనగా ఒకటి ప్రణవమందు జెప్పుచున్న శేషత్వస్వరూపమునకుండు విరోధియును. రెండు యీ (నమః) పదమందు జెప్పుచున్న భగవదేకోపాయత్వ స్వరూపమున కుండు విరోధియును. మూడు [నారాయణ] పదమందు జెప్పు చున్న ప్రాప్యస్వరూపమునకుండు విరోధియును.

85. ఈ విరోధులు పోవడమనగా నేమనగా స్వరూప విరోధి యనునది [నేను నాది] యను అహంకార మమకార ములే యగుటచేత వాటినివిడిచి నేను నీకు పరతంత్రుడను నా సంబంధముగల వస్తువులు నీకు పరతంత్రములని యాత్మా త్మీయములను భగవత్సన్నిధిని సమర్పించియుండుటయే స్వరూప విరోధిపోవుట. రెండు ఉపాయ విరోధియనునది తన రక్షణ విషయమై దానుస్వతంత్రించి యుండుటచేతను దానినివిడుచు కొని తన రక్షణభారమును సర్వేశ్వరునియం దుంచుటయే

ఉపాయవిరోధి పోవుట. మూడు ప్రాప్యవిరోధియనునది పరమ పదమందీశ్వరునికి దానుజేయు కైంకర్యమును దన యిచ్ఛా ప్రకారము చేయుట. దానినివిడచి యీశ్వరునికే ప్రియమైన కైంకర్యము జేయుటయే ప్రాప్యవిరోధి పోవుట.

86. [మః] అను పదమందు అహంకార మమకారము లుండుటచేతను దానితో సంబంధించడ మాత్మస్వరూప నాశనము. [నమః] పదముచేత యహంకార మమకారములు దీసి వేయబడుచున్నవి. గనుక దానితో సంబంధించడ మాత్మ స్వరూపమునకుజ్జీవనము. అనగా దానిని ప్రకాశింపజేయుచున్నది.

87. ఈ [నమః] యను పదము ప్రణవమునందు జెప్ప బడిన యనన్యార్హ శేషత్వ స్వరూపమును [నారాయణ] పదమందు జెప్పబడిన యనన్యభోగ్యత్వ స్వరూపమైన ఫలస్వ రూపమును ప్రకాశింపజేయుచున్నది. అనన్య శరణత్వమనగా భగవంతుడే రక్షకుడనియు నితరులు రక్షకులు గారనియును అనన్య భోగ్యత్వమనగా భగవత్కైంకర్యమే తనకు భోగ్య మనియు నితరము భోగ్యముగాదని నమ్మియుండుట.

88. ఈ స్వరూపోపాయ పురుషార్థములను ప్రకాశింప జేయువిధ మేమనగా నాళ్వారులు భగవచ్ఛేషత్వ మాత్ర ముతో దృప్తిపొందక వాని సంబధమైన తొలివిల్లిమంగలమనే దివ్యదేశమునకు కూడా తాము శేషమైన ప్రకారమును "తొండుం" అనే (నమః) పదమును సాయించినందువల్ల నీ [నమః]

పదము శేషత్వ స్వరూపమును ప్రకాశింపజేయుచున్నది. రెండు అళ్వారులు తిరువేంగడముడయానుకు నేను శేషభూతుడను నాకుఁ గాను అనుటవల్లనే నారక్షణోపాయము నాకు లేదు. వానియందే యున్నది అను నర్థమును ( నమః ) పదమున సాధించుటచేత నీపదముపాయమును ప్రకాశింపజేయుచున్నది. మూడవ ఆళ్వారులు నిత్యవిభూతియందు చేయు కైంకర్యము యొక్క భోగ్యాతిశయముచేత నొక విధమైన స్వాతంత్ర్యము బుట్టినందున దానిని బోగొట్టుకొని కైంకర్యమును వృద్ధిబొందించుకొనుటకు కైంకర్యాంతమగు ( నమః ) పదమును సాధించుటచేతను దీనియందు ప్రాప్యము ప్రకాశింపజేయబడుచున్నది.

89. తిరుమంగైయాళ్వారు శ్రీతిరుమంత్రమందు సకలార్థము లున్నట్లొప్పుకొనుచు భగవత్ప్రియకరమైన భాగవత శేషత్వమునే ప్రధానార్థముగా సాధించియున్నారు గనుక భగవచ్ఛేషత్వమునకు విరోధులయిన యహంకార మమకారములను నశింపచేసి యీభగవచ్ఛేషత్వమును ప్రకాశింపచేయుచున్నట్లు (నమః) పదమందు భాగవత శేషత్వము గూడా అనుసంధించుకొన వలయును.

90. జీవునియొక్క శేషత్వమును జెప్పుచుండెడు లుప్త చతుర్థితో గూడుకొని (అ) కారమందును యీ భాగవత శేషత్వమున్నదని కొందరు చెప్పుదురు.

91. ఈశ్వరు డెల్లప్పుడు స్వతంత్రుడై యుండుననియు, అచిత్తనగా ప్రకృతి చైతన్యము లేని పదార్థమగుటచేత స్వాతంత్ర్యము లేక యెల్లప్పుడు పరాధీనమై యుండుననియు, ఆత్మ జ్ఞానము గలవాడగుటచేత స్వతంత్రుడనియు. శేషత్వముగలవాడగుటచేత నీశ్వర పరతంత్రుడనియు బ్రణవమందువలెగాక, అచిత్తును పదార్థముగనే పరిగ్రహించునట్లు, కేవల మీశ్వరునికే ప్రియమగునట్లు దన్ను బరిగ్రహించవలెనని ఆత్మ ప్రార్థించు ప్రార్థన జెప్పబడుచున్నది.

92. ఈశ్వర సన్నిధిని జీవుడు కైంకర్యము జేయునప్పుడు యీశ్వరుడు వీనియందు మోహముచే దన స్వామిత్వమును వీనియందుంచి వీని శేషత్వము దానవలంబించి వీని (జీవుని) యొక్క శేషత్వమును జెడగొట్టునప్పుడు తన శేషత్వమునుగా పాడుకొనుటకై యీశ్వర భోగమునకు ప్రతిబంధకము గలుగ జేయగూడదు.

93. ప్రణవ మందును ( నారాయణ ) పదమందును ఆత్మకు భగవచ్ఛేషత్వమును, శేషత్వోచితమైన కైంకర్యమును స్వరూపముగా జెప్పుచుండగా, నందుకు విరోధముగా భగవంతు డాత్మకంటే తక్కువగానున్నట్లు భోగదశయందు గనుపడబోవునప్పుడు తన శేషత్వమునకు భంగముగల్గునో

యను సంశయముతో నీశ్వరునియొక్క భోగమునకు భంగము గలుగ జేయకూడదని తాత్పర్యము.

94. ఇదివరలో జెప్పిన పారతంత్ర్య జ్ఞానము యొక్క వైభవమేనగా భగవదేక శేషముగానే నన్ను బరిగ్రహించవలెననెడి యీ పారతంత్ర్యజ్ఞానము పుట్టిన మాత్రముచేత నీ యాత్మ కృతకృత్యు డగుచున్నాడనగా దనహితార్థమై జేయవలసిన పనులన్నియు చేసినవాడగుచున్నాడు. ఇట్లుచిద్వత్ పారతంత్ర్యజ్ఞానము లేనప్పుడాత్మాపహారము మొదలగు సకల దుష్కృతములును చేయుబడినవే. ఈ యచిద్వత్పారతంత్ర్య జ్ఞానమున్నమాత్రముచేత సర్వేశ్వరునకు సర్వసుకృతములును జేసినవానియందు గలిగెడి ప్రేమ గలును. ఈ యచిద్వత్పారతంత్ర్య జ్ఞానములేకుండా యీశ్వర ప్రీతికొఱకు తన పాపములు నశించుటకొఱకు జేయు యజ్ఞాదులున్న ప్రాయశ్చిత్తాదులున్ను నిష్ప్రయోజనములగును. ఈపారతంత్ర్య జ్ఞానము గల్గిన మాత్రముచేత సమస్త పాపములును బోయి సమస్తఫలములును సిద్ధించును.

95. ( నారాయణ ) పదమున కర్థమేమనగా ఒకటి (నారాణాం అయనం యః సః నారాయణః) అనియు రెండు (నారాః అయనం యస్యసః నారాయణః) అనియు తత్పురుష బహువ్రీహి సమాసములు రెండింటి చేతనున్ను నారాయణ పదము రెండర్థములు జెప్పుచున్నదగుటచేత ముందు తత్పురుష

సమాసార్థము జెప్పబడును "నారాణాం=నారములకు, అయనం =స్థానము, యః=ఎవఁడో, సః=వాఁడు, నారాయణుఁడు" ఈ సమాసమందయన పదమునకు బాహ్యమనఁగా ఫలమున్ను ప్రాపకమనఁగా నుపాయమున్ను అర్థములగుచున్నవి. ఇవి ముందు వివరింపఁబడును.

96. నారములనఁగా నశింపని వస్తువులయొక్క సమూహము "రిఙ్ క్షయే" యను ధాతువుపై నిబుట్టిన (ర) యనుపద మునకు నశించు వస్తువు అర్థమై (నర) అని (న) కారము చాని తోఁగలసి నాశములేని వస్తువును జెప్పును. సమూహార్థమందు (అణ్) ప్రత్యయమున్ను ఆదివృద్ధియును వచ్చి నారః యనుప దమై నిత్యవస్తువులయొక్క సమూహమును జెప్పును. నారాః యను బహువచనము సమూహములయొక్క బాహుళ్యమును జెప్పును.

97. ఆ నిత్యవస్తు సమూహము లేవనఁగా నీశ్వరస్వరూ మును నిరూపించునవనఁగా నిర్ణయించు జ్ఞానానందామలత్వా దులును, వాటిచే నిర్ణయింపబడిన ఈశ్వర స్వరూపమునకు విశేషములై సకలగుణప్రధానములైన ఒకటి జ్ఞానము, రెండు బలము, మూఁడు శక్తి, నాల్గు ఐశ్వర్యము, అయిదు వీర్యము ఆఱు తేజస్సు యను షడ్గుణములును, ఆషడ్గుణముల కధీన ములైన వాత్సల్య స్వామిత్వ సౌశీల్య సౌలభ్య సర్వశక్తిత్వ సర్వజ్ఞానత్వము మొదలగు ననంత కల్యాణ గుణములును బర

మపదమందు నిత్యమందు దివ్యమంగళ విగ్రహములును ఇచ్ఛ
చేత పరిగ్రహించు అవతారాది సకలదివ్యమంగళ విగ్రహము
లును, ఆవిగ్రహగుణములైన సౌందర్య సౌకుమార్య సౌగంధ్య
లావణ్యయౌవనమాదిగా నా విగ్రహమందు ధరింపబడుననంత
దివ్యాభరణములును, శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గము మొదలగు
ననంతాయుధములును, శ్రీ భూ దేవులు మొదలగు ననంత
దేవులును, అనంత గరుడ విష్వక్సేనులు మొదలగు ననంత
నిత్యసూరులును, కైంకర్యోపకరణములైన ఛత్రచామరతాళ
వృంతములును వాహతీర్థములనుంచుకొను గిండీలును, పరిగ్ర
హములనగా పీకుదానులు మొదలగునవియును ద్వారములను
గాచుచుండు ప్రచండ భద్ర శుభద్ర జయ విజయ . ధాతృ
విధాతృలు మొదలగు ద్వారపాలకులును, కుముదకుముదాక్ష
పుండరీక వామన సర్వనేత్ర శంఖుకర్ణ సుముఖ సుప్రతిష్టి
తాది సేనాధిపతులును, సంసారసంబంధమును విడిచి పరమ
పదమునకుం బోయి నిత్యులతో సమానమగు దివ్య శరీర
ములనొంది సకల కైంకర్యములను జేయు ననంత ముక్తాత్మ
లును, పంచోపనిషణ్మయమైన పరమపదంబును, పంచోప
నిషత్తులనగా పరమేష్టి శక్తియు బుగుమశక్తియు విశ్వశక్తియు
నివృత్తిశక్తియు సర్వశక్తియు నను పేరుగల నీ యైదింటిని
పంచకోపనిషత్తులని పాంచరాత్రము జెప్పుచున్నది. ఈ జగ
త్తు పంచభూతాత్మకమైనట్లూ పరమపదము బంచశక్తి మయ
మని పాంచరాత్రమునందు జెప్పబడుచున్నది. సత్వరజస్తమో

గుణాత్మకమైన లీలావిభూతికి కారణంబై ఈశ్వర లీలోపకరణమైన మూల ప్రకృతియును, మైనములో నంటుకొన్న బంగారు రేణువులవలెనే మూల ప్రకృతిలో నంటుకొనిపోయి కరణకళేబరములులేక యచిత్ప్రాయులై యున్న బద్ధాత్మలును, క్షణలవాదిరూపమైన కాలంబును. మూల ప్రకృతివికారములైన మహదాదులును మహత్తు, అహంకారము, పృథివ్యాది పంచభూతములు, గంధాదిపంచ విషయములు, త్వగాది పంచ జ్ఞానేంద్రియములు వాగాది పంచకర్మేంద్రియములు మనస్సను జ్ఞానేంద్రియ మీ యిరువదిమూడు వికారములును అనంతకోటి బ్రహ్మాండములును, ఆబ్రహ్మాండముల లోపల నుండు దేవతలు మనుష్యులు పశుపక్షి క్రిమి కీటకాదులు వృక్ష శిఖరాదులీ సమస్తమున్ను నిత్యవస్తుసమూహమనబడును. ఈ నిత్యవస్తువులు రెండు విధములు. ఒకటి స్వరూపతః నిత్యములనియు రెండు ప్రవాహతః నిత్యములనియును, స్వరూపముతో నిత్యములనగా నెప్పుడేవిధమగు మార్పులేక ఏకాకారముగానుండు పదార్థములు. అవి జ్ఞానానందామలత్వాదులు మొదలుకొని కాలము వరకు పైన జెప్పబడిన పదార్థములు. ప్రవాహతో నిత్యములనగా నుత్పత్తి వినాశాది వికారములవల్ల గలుగు రూపభేదములున్నప్పటికిన్ని, స్వరూపాదులకు నాశములేని పదార్థములు, ఇవి మహదాదులు మొదలుకొని దేవాది పదార్థములవరకును పైని చెప్పబడినవి.

98. ఆధారవాచియైన అయన శబ్దమిూ నిత్యవస్తువుల కీశ్వరస్వరూప మాధారమని చెప్పుచున్నది.

99. పైనచెప్పిన తత్పురుషార్థముగాక (నారాః అయనం యస్య సః) యను బహువ్రీహిసమాసప్రకారముగా నీనిత్యవస్తు సమూహము లాశ్రయముగా గలవాడనగా స్థానముగా గలవాడనియు జెప్పుదురు. (నారాః=నారములు, అయనం=స్థానము, యస్య=ఎవనికో సః=వాడు నారాయణః అనబడుచున్నాడు) అనిబహువ్రీహిసమాసార్థము. తత్పురుషసమాసార్థమం దీశ్వరుని కల్యాణ గుణములనుకూడా నారశబ్ద వాచ్యములుగా దీసుకొనినప్పటికిన్ని. ఈ బహువ్రీహి సమాసమందు వాటిని విడిచి తక్కినవాటినే తీసుకొనవలసి యుండును. ఆలాగున దీసికొనని యెడల నాత్మాశ్రయమును అనవస్థా యను రెండు దోషములు వచ్చును. ఆత్మాశ్రయమనగా తనయందు తానుండుట అనగా తనకు తానే యాధారమై యుండుట. లోకములో నొక మనిషి తన మెడపైని దానెక్కి కూర్చుండుటవలె నసందర్భముగాగనబడును. ఎట్లనగానీశ్వరుడు సగుణుడు గనుక తన గుణములలోబ్రవేసించినప్పుడు సగుణుడయ్యె ప్రవేశించవలెను. అట్లు ప్రవేశించునప్పుడు ప్రవేశించబడుచున్న గుణములే ప్రవేశించువాని గుణములై యుండుట వల్ల వాటికిని వీటికిని భేదములేక ఆత్మాశ్రయమను దోషము వచ్చును. అనవస్థా దోషమనగా పరిసమాప్తి లేకపోవుట,

ఆత్మాశ్రయదోషమును పోగొట్టుటకై ఈశ్వరునియందున్న గుణములకును బ్రవేశించబడు గుణములకును స్వరూపభేద మంగీకరించు పక్షమున, ప్రవేశింపబోవునవు డీశ్వరునియం దుండు గుణముల యందును తిరుగ గుణవిశిష్టుడయ్యే వ్యాపించవలసియుండును. ఇందువల్ల బహు గుణకల్పనమువచ్చును గనుక అనవస్థాదోషము తప్పదు.

100. ఈ తత్పురుష బహువ్రీహి యనెడు రెండు సమాసములచేత గలిగిన ఫలిత మేమనగా సమస్త పదార్థముల కాధారమై యుండుటయనెడు పరత్వమనగా నాధిక్యము తత్పురుషవల్లనున్ను, యిట్టి యధికుడైన తాను సకల చేతనా చేతనములం దమరి యంతర్యామిగా నుండుటవలన వచ్చిన సౌలభ్యమనగా సర్వసులభత బహువ్రీహి సమాసము వలనను ఫలించినది.

101. ఈ రెండు సమాసములవలననున్ను అంతర్యామిత్వమును ఉపాయత్వమును ఉపేయత్వము గూడా చెప్పబడుచున్నవి. బహువ్రీహి మొదలైన సమాసములచేత అంతర్యామి బ్రాహ్మణము మొదలైన ఉపనిషత్తులయందు "యస్యాత్మా శరీరం య ఆత్మానమన్తరోయమయతి యమాత్మానవేద" ఇత్యాది వాక్యార్థప్రకారముగా సమస్త పదార్థముల కంతర్యామిగా నుండి నియమించువాడై వర్తించుటనెడి అంతర్యామిత్వము జెప్పబడుచున్నది. (యస్యాత్మాశరీరం) యస్య=ఏపర

మాత్మకు, ఆత్మా=జీవాత్మ, శరీరం=శరీరము, (యః ఆత్మాన
మన్తరోయమయతి) యః=ఏపరమాత్మ, ఆత్మానం= ఆత్మను,
అంతరః= అంతర్యామియైనవాడై, యమయతి= నియమించు
చున్నాడో (యమాత్మానవేద) యం=ఏపరమాత్మను,ఆత్మా=
జీవాత్మ, నవేద=ఎరుగడో అని శ్రుత్యర్థము. తత్పురుష
సమాసముచేతను "ఇణ్ గతౌ" యను ధాతువువల్లగాని "అ
య గతౌ" అను ధాతువువల్లగాని సిద్ధించినయీ అయన పద
మందు "ఈయతే అనే నేత్యయనం" అను కరణే వ్యుత్పత్తి వల
ననున్ను ఉపాయోపేయత్వములు క్రమముగా జెప్పబడు
చున్నవి. ఇణ్ అను ధాతువుకు పొందు టర్థము"ఈయతేఅనేన
ఇతి అయనం" అనేన=దీనిచేతను ఈయతే=పొందింపబడును
కాగా అయనం అను కరణే వ్యుత్పత్తికర్థము "ఈయతే ఇతి
అయనం" పొందబడుచున్నది. కాగా అయనం అని కర్మణివ్యు
త్పత్తి కర్థము. కరణార్థమును జెప్పునది కరణే వ్యుత్పత్తిఅథవా
కరణ వ్యుత్పత్తియనబడును. మనము బొందు ఫలమున కీశ్వ
రుడు కరణమై అనగా సాధనమైన ప్రకారమును జెప్పు
చున్నది. గనుక కరణేవ్యుత్పత్తి యనబడును. కర్మార్థమును
జెప్పునది కర్మణివ్యుత్పత్తియనఁబడును. పొందబడు టీశ్వరుడే
గనుక కర్మత్వము వచ్చుటవలన కర్మణివ్యుత్పత్తియనఁబడును
తత్పురుషసమాసమందు ఉపాయత్వము ఉపేయత్వము లర్థము
జెప్పునప్పుడు (నార) శబ్దమునకు అచేతనములను విడిచి చేతన

ములను మాత్రమే యర్థముగా జెప్పవలెను. అచేతనములకు జ్ఞానము లేను గనుక జ్ఞానకార్యమైన యుపాయత్వోపేయత్వములు లేవని వసిష్టస్మృతి మొదలగు వానియందు జెప్పబడుచున్నది.

102. ఈనారాయణ శబ్దార్థమును తిరుమంగైయాళ్వారు లనుసంధించునపు డీశ్వరుని సర్వవిధ బంధుత్వమును సాయించినందువలన "అయన" పదమందు బంధుత్వప్రయుక్తమగు ప్రాప్యత్వము జెప్పఁబడుచున్నది. బంధుత్వప్రయుక్తమైన ప్రాప్యత్వమే గాక అయన పదమందీశ్వరునియొక్క సర్వవిధ ప్రాప్యత్వమున్ను చెప్పబడును.

103. ఈశ్వరునితో మనము ద్వేషించి అన్యశేషభూతులమైనపుడున్ను ఆయన మనలను విడువక మనకు మంచినే చేయుచుండును. ఇందువలన నీశ్వరుడే నిరుపాధిక బంధువుడని నిరూపింపదగియున్నది.

104. మన కీశ్వరుడు చేయు మంచి యేమనగా లోకములో దుర్మార్గుడైన కుమారుడు హితవుజెప్పిన తండ్రితో ద్వేషించి ఆయనను విడిచి పైకివెళ్ళిపోయి యుపవాసముగానున్నప్పుడు వానియందలి దయచేతను వానిని విడువజాలక వాడుండుచోటికి నెవరికిని దెలియకుండా తానంపినట్లున్నయించకుండాయాహారము మొదలగువాటి నంపి రక్షించుప్రకారముగా నీశ్వరుడు తనయొద్ద శేషపడక యీ చేతనులు స్వతంత్రులై తిరుగుచున్నప్పటికిన్ని తాను వీరియందలికృపచేత

వినవజాలక యెదుటకు స్వయముగా వచ్చి రక్షించుదమంటె అంగీకరించరేమో యని అంతర్యామియై యుండి సమస్త విధముల రక్షించుచుండును.

105. (ఆయ) యను నీ చతుర్థిచేత అనంతాళ్వారులు జేయు కైంకర్యమువలెనే సర్వవిధ కైంకర్యములను జేయ వలెనని చేతనుడు ప్రార్థించు ప్రార్థన చెప్పబడుచున్నది. ఈశ్వరున కెండవానలు దవ్వలకుండా ఛత్రముగాను కూర్చుండుచో సింహాసనముగాను నిలువబడునప్పుడు పాదుకలుగాను క్షీరాబ్ధియందు బవ్వళించునపుడు పఱుపుగాను పిరాట్టితో వేంచేసి యున్నప్పుడు మంగళదీపముగాను ధరించుటకు పట్టువస్త్రము గాను చేగబడుటకు బాలీసుగాను మఱియు నాయాయవస్థల యందా యారూపములుగా నుండి సర్వశేషవృత్తులను జేయుట చేతనే అనంతాళ్వారులకు శేషుడను తిరునామ మనగా పేరు వచ్చినదని ఆళ్వారాచార్యులు సాయించియున్నారు.

106. (నమః) అను పదముచేతను ఈ చేతనునికి తన కాదరించుటకై యవకాశమును లేని పారతంత్ర్యము జెప్ప బడియుండగా నీ చతుర్థియందు కైంకర్య మాదరించి ప్రార్థించుట కూడునా యంటిరేని.

107. అచిద్వత్పారతంత్ర్యమును (నమః) పదము నందు జెప్పినప్పటికిన్ని ఈ కైంకర్య ప్రార్థనయనునది స్వభోక్తృత్వరూపమైన యహంకారము మూలములగా వచ్చినది కాదు

గనుక నున్ను సర్వేశ్వరునికి ప్రీతి జేయడమే స్వరూపముగా గల శేషత్వ ప్రయుక్తముగా వచ్చినది గనుక నున్ను అనగా అచిత్తునై పడియుండి నీ కైంకర్యము చేతును గాక యనిఅత్యంత పారతంత్ర్యముతోగూడా ఈ కైంకర్యమును శ్రీ కులశేఖ రాళ్వారులు ప్రార్థించినందువల్ల నిది స్వరూప విరుద్ధముగాద నగా స్వరూపోచితమే యగును.

108 అందుచేతను సర్వవిధ కైంకర్యములు నెడతెగ కుండా మేము సేతుము గాకయని ఆళ్వారులు ప్రార్థించిన కైంకర్యప్రార్థనను ఈ చతుర్థీ విభక్తి చెప్పుచున్నది.

109. ఈశ్వరుని సేవించినగాని మనస్సు నిలువని వారికి సేవించువరకు నిద్రపట్టదు. సేవించునట్టి సమయమున "సదా పశ్యంతి సూరయః" అన్నట్లు, సర్వదా వానినే సేవించు చున్నందున నిద్రయుండదు. ఈ శ్రుతికి సూరయః = అనంత గరుడ విష్వక్సేనాదులగు నిత్యసూరులు, సదా = ఎల్లప్పుడు, పశ్యంతి = చూచుచున్నారనగా సేవించుచున్నారని యర్థము.

110. ఈశ్వరుని సేవించిన పిమ్మట ఈలాగున నిత్య సేవగు నిత్యానుభవము జేయవలసిన కాలమంతయు సంసారములో బడి వ్యర్థముగా పోగొట్టుకొంటినేయని యది వరలో గతించిన కాలమును తలంచుకొని చింతించు చేతనునికి మఱి నిద్రవచ్చునా?

111. ఈశ్వరజ్ఞానము కలుగనప్పుడు నేను లేనివాడను. జ్ఞానము కలిగిన తర్వాత మైమరచి యెఱుగనని ఆళ్వార్లు సా

యిచటచేత భగవద్జ్ఞానము గలవారికి నిద్రలేక పోవడము సరేకదా మఱుపుకూడా గలుగదు.

112. ఈశ్వర కైంకర్యము దాసక్తిగలవారిస్థితి యిది గనుక ఈ కైంకర్యప్రార్థన సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు ననువర్తించే యుండును. స్వరూప విరుద్ధముకాదు.

113. భార్యకు మంగళసూత్రధారణమువలన భర్తకే యధీనురాలై యన్యుల కధీనురాలుగాదనే యంశమును గనబరచునట్లుగా నీ తిరుమంత్రోపదేశము వలన చేతనులీశ్వరున కధీనులుగాని యన్యులకు గారను యంశమును గనుపరచుటకై ఈ అష్టాక్షరీ మంత్రమును మంగళసూత్రముగా నిరూపించు చున్నారు. పదునారుదారములతో పేని రెండుపేటలుగా కట్టబడిన లౌకిక మంగళసూత్రమువలెగాక, ఎనిమిదిదారములతోనే పేని మూడు పేటలుగా కట్టబడిన మంగళసూత్రము వలెనే ఎనిమిదక్షరములతో కూర్చబడి మూడుపదములుగా నేర్పరుపబడిన ఈ తిరుమంత్ర మీశ్వరునిచేత ఆత్మకుగట్టబడిన మంగళసూత్రము. ఇందువలన తిరుమంత్రోపదేశమాత్మల కావశ్యకము.

114. ఇందువలన నీ తిరుమంత్రముతో సంబంధము గల యాత్మల కీశ్వరుడు పతియైయుండి రక్షించును.

115. ఈ తిరుమంత్రములో విస్తారముగా జెప్పిన యర్థమును సంగ్రహముగా సాయించుచున్నారు. (అ) కారవాచ్య

డై సర్వరక్షకుడైన సర్వేశ్వరునకే శేషభూతుడైన నేను నాకు గాని యన్యులకు గాని శేషభూతుడను గాకపోవలెను సర్వశేషియైన శ్రీమన్నారాయణునకే సర్వవిధ కైంకర్యములఁ జేతును గాకయని చేతనుడుసేయు ప్రార్థనను ఈ మంత్రము జెప్పుచున్నది.

ఎంబెరుమనాక్ తిరువడిగళే శరణం.

ము ము క్షు ప్ప డి

అ ను

తిరు మంత్రార్థమునఁదు

తిరుమంత్రప్రకరణము

సం పూ ర్ణ ము.



శ్రీమతే రామానుజాయ నమః.







# ముముక్షుప్పడి

అను

# తిరుమంత్రార్థము.

## ద్వయప్రకరణము.

1. ఈ తిరుమంత్రములో (నమః) పదముచేత చెప్పబడిన యుపాయత్వమున్ను (నారాయణ) పదముచేత చెప్పబడిన యుపేయత్వమనగా ఫలమున్ను "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" యను పూర్వవాక్యము చేతనున్ను "శ్రీమతే నారాయణాయ నమః" యను ఉత్తరవాక్యముచేతనున్ను క్రమముగా నందరికిని విశదముగా దెలియునట్లు చెప్పుచుండుట చేత నీమంత్రరత్నమునకు ద్వయమని పేరుగలిగినది. యీప్రకరణములో దానియర్థమును చెప్పుటచేత నిది ద్వయప్రకరణమనబడుచున్నది.

ఈ మంత్రము శ్రీవిష్ణులోకమునందు పెరియ పిరాట్టికి శ్రియఃపతిచే నుపదేశింపబడినది. ఈమెవలన విష్వక్సేనున కుపదేశింపబడి వారిద్వారా శ్రీమన్నమ్మాళ్వారులకులబ్ధమై యుపదేశ పరంపరా వచ్చుచున్నది. శ్రీవైష్ణవున కావశ్యముగానుండవలసిన లక్షణములు. "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనినప్రకార మీశ్వరునకంటె యితరములైన వాటియందనగా కర్మజ్ఞాన భక్త్యాద్యుపాయములందును దారాపుత్రాది విషయములయందును సంబంధమును విడుచుకొనుటయు, "మామేకం శరణంవ్రజ" అనినప్రకారముగా సర్వరక్షకుడైన సర్వేశ్వరుడే రక్షకుడని ఆశ్రయించుటయు, మనము చేయుప్రపత్తి బహుస్వల్పమైనప్పటికిన్ని మనయందుగల దోషము లధికములైనప్పటికిని మన మొందవలసిన ఫలము మిగులగొప్పదైనప్పటికిన్ని, మనమురక్షకముగా నాశ్రయించు సర్వేశ్వరుడు మనకు ఫలమును తప్పక యిచ్చునను నమ్మకమున్ను, ఆఫలసిద్ధికొఱకు త్వరపడుటయు, యీభూమియందుదాను సజీవులైయుండు దినములలో శ్రీరంగాది దివ్యస్థలములయం దీశ్వరగుణానుభవ కైంకర్యములతో కాలము వెళ్ళబుచ్చుటయు, యీప్రకారముగా కాలక్షేపము జేయుచున్న భాగవతులయొక్క యతిశయమునుజూచునప్పుడసూయపడకసంతోషించుటయును తిరుమంత్రద్వయనియమముగలవారైయుండుట యనగా నితరమంత్రములయం దేమరుపాటుననైనను నమ్మకముంచక ఈతిరుమం

త్రద్వయములందు జెప్పబడిన యర్థము దా నాచరించుటయు నిట్టి నిష్ఠ నుపదేశాదులచేతను తనకుగలుగ జేసిన యాచార్యుని విషయమునను, అట్టి యాచార్యునితో దనను చేర్చినట్టి యీశ్వరునియందు నుపకారస్మృతి గల్గియుండుటయును, చిదచిదీశ్వర తత్త్వవిషయమైన యథార్థజ్ఞానమున్ను, క్షుద్రవిషయ విరక్తియున్ను వీటిని గలిగి యుండుటయు, యివి తనకు గలవని గర్వించకుండుటయనెడి శాంతియును, పరమసాత్త్వికునితో సహవాసము చేయుటయును ఇవి శ్రీవైష్ణవున కవశ్యాపేక్షితములు,

2. ఇట్టి శ్రీవైష్ణవుడు జ్ఞానానుష్ఠానములను వృద్ధి నొందించు తిరుమంత్రద్వయ చరమ శ్లోకములను నిత్యమనుసంధించుకొనవలయును.

3. సకల శాస్త్రములయందును కర్మజ్ఞానాది సాధనానుష్ఠానములకు యోగ్యమైన దేహముచేతనే మోక్షరూపమైన ఫలము సిద్ధించునని చెప్పబడుచున్నది. ఈ తిరుమంత్రమందీశ్వరుడే తనకు రక్షకుడు: తానుగాని యన్యులుగాని కారనెడి పారతంత్ర్యజ్ఞానముచేత యీశ్వరుడు దన్ను రక్షించుటకు విరోధియైన స్వవ్యాపారమును విడచియున్న యాత్మచేతనే పురుషార్థసిద్ధి గలుగునని చెప్పబడుచున్నది. చరమశ్లోకమందీ చేతనుడుజేయు ప్రపత్తినిన్ని యపేక్షింపక తానే నిర్హేతుకముగా కటాక్షించి ప్రాప్తిప్రతిబంధకములగు సకల పాపములను బోగొట్టి తన సన్నిధానమునకు జేర్చుకొనునట్టి ఈశ్వరుని చేతనే పురుషార్థసిద్ధి గల్గునని చెప్పబడుచున్నది. ద్వయమందు

భగవదేక శేషభూతురాలగు పెరియ పిరాట్టిచేతనే పురుషార్థ సిద్ధి గల్గునని చెప్పబడుచున్నది.

4. ఈ చేతనులకు సకల విరోధులను బోగొట్టి సకల ఫలముల నిచ్చువా డీశ్వరుడైయుండగా, పెరియపిరాట్టిచేతపురుషార్థసిద్ధిగల్గును. పురుషకారమనగా "పురు సనోతీతి పురుషః" పురు=అధికముగా, సనోతి=ఇచ్చుచున్నాడు. కాగా పురుషః అనిపించుకొనుచున్నాడు. "పురుషం కరోతీతి పురుషకారః" పురుషం=అధికదాతనుగా, కరోతి=చేయుచున్నది కాగా పురుషకారః అనిపించుకొనుచున్నది, పురుషకారమని పిరాట్టికి నామముగా పూర్వాచార్యులు వ్యవహరించుచున్నారు. ఈపురుషకారత్వమనే ధర్మము పెరియపిరాట్టిదే యైయుండి యితరులది గాకపోవుటచేతను పురుషకారత్వమనే ధర్మమే ఆమెకు నిరూపకమైన నామధేయమై యున్నది.

5. ఉపాయాంతర శూన్యత్వమనెడు ఆకించన్యమును రక్షకాంతర శూన్యత్వమనెడు అనన్య గతిత్వమున్ను గలవాడే ద్వయానుసంధానమున కధికారియగును.

6. ఆకించన్యత్వానన్య గతిత్వములనెడు రెంటినిగూర్చి పిళ్ళైపన్న పరిత్రాణమనెడు గ్రంథములో విశదముగా జెప్పబడినది.

7. ఈ ద్వయ మంత్రమందలి (శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే) అను పూర్వ ఖండముచేతను పెరియ పిరాట్టిని ముందుంచుకొని సర్వేశ్వరుని తిరువడిగళ నుపాయముగా నాశ్రయించుట చెప్పబడుచున్నది. (శ్రీమతేనారాయణాయ నమః)అను యుత్తరఖండముచేత శ్రీయః పతి సన్నిధిని జేయు కైంకర్య ప్రార్థన చెప్పబడునున్నది.

8. శ్రీః యనునది పెరియపిరాట్టికి నామము రక్షకత్వాదులకు వాచకమైన (అ) కారమీశ్వరునికి ప్రథమ నామధేయమైనట్లు పురుషకారత్వమునకు వాచకమైన ఈ శ్రీ శబ్దము లక్ష్మీదేవికి ప్రథమ నామధేయము.

9. ఈ శ్రీ శబ్దమునకు (శ్రీఞ్ సేవాయాం) ధాతువునందు "శ్రయతే ఇతి శ్రీః శ్రీయతే ఇతి శ్రీః" అని సిద్ధమైన కర్తరివ్యుత్పత్తిని కర్మణివ్యుత్పత్తినిన్ని చెప్పుచున్నారు.

10. శ్రీయతే యను వ్యుత్పత్తికి శ్రీయతే ఇతి శ్రీః చేతనులచే ఆశ్రయింప బడుచున్నదని యర్థము.శ్రయతే యను వ్యుత్పత్తికి (శ్రయతే=ఇతిశ్రీః) భగవంతుని నాశ్రయించుచున్నది. అనియర్థము.

11. ఈశ్వరున కుపాయత్వోపేయత్వములను రెండాకారములు గలవు.యీద్వయముయొక్క పూర్వవాక్యమందు చేతను డీశ్వరు నాశ్రయించుట చెప్పబడుచున్నది. గనుక నాశ్రయమునకు బురుషకార మావశ్యకమై యుండుటచేత యీ

పదమునందు పిరాట్టియొక్క పురుషకారత్వ రూపమగు ఆకారము చెప్పబడుచున్నది. వడగలై వా రీశ్వరున కుపాయత్వము జెప్పిన యీ పూర్వ వాక్యమందు వానిని పిడువకుండా యుండు కళ్యాణగుణములవలె ఈ పిరాట్టియున్ను ఆయనను వదలకుండా యుండుటచేతను యీశ్వర గుణముల కుపాయత్వమున్నట్లు పిరాట్టికిన్ని యుపాయత్వమున్నదని చెప్పాదురు. అట్టె పిరాట్టి కుపాయత్వము జెప్పినయెడల నీశ్వరునికిన్ని పిరాట్టికిన్ని యుభయులకున్ను ఫలసాధనత్వము జెప్పబడి, ఒక ఫలమునకు రెండు సాధనములను జెప్పిన దోషము వచ్చును. ఈదోషము ఉపాయత్వ ద్విత్వమని శాస్త్రమందు జెప్పబడుచున్నది. ఈ హేతువుచేతనున్ను ఈశ్వరుని యొక్క నైరపేక్ష్యమున కనగా తాను జేయు కార్యమున కన్యసహాయమును సహించక పోవుటకు భంగము కలుగుటచేతనున్ను పిరాట్టికుపాయత్వమును చెప్పక, పురుషకారత్వమునే తెంగలైవారు చెప్పాదురు. వడగలైయనగా నుత్తరశాస్త్రము. అనగా సంస్కృతశాస్త్రము. అది ప్రధానముగా గలవారు వడగలైవారు. తెంగలై యనగా దక్షిణశాస్త్రము. అనగా ద్రావిడవేదమునే ప్రధానముగా గలవారు తెంగలైవారు.

12. ఈచేతను డీశ్వరునకును దనకును గలిగియున్న స్వాభావిక సంబంధమును దెలిసికొని ఆశ్రయించి ఫలమును సంపాదింప దగియుండగా, నీమె పురుషకార మెందులకంటె

చల్లని జలమందతితీక్ష్ణమైన యగ్నిహోత్రము పుట్టినట్టుగా సర్వభూత సుహృత్త్వము మొదలగు స్వభావము చేతను మిక్కిలి చల్లనైన యీశ్వరుని హృదయమందు ఈ చేతనుల యపరాధమువల్ల వారి హితము నిమిత్తము కోపము బుట్టినప్పుడు దానిని పోగొట్టుకొనుటకు ఈ పురుషకారమును ముందుంచుకొనుట యావశ్యాపేక్షితము; ఈమె పురుషకారానంతర మందీశ్వరుడు క్షమించును.

13, ఈ పిరాట్టికి చేతనులతో మాతృత్వ సంబధముండుటచేత వీరి దుఃఖమును సహింపజాలక యుండుటచేతను ఈశ్వరునితో పత్నిత్వ సంబంధముండుటచేత యాయనకత్యంత ప్రియురాలై యుండుటచేతను, ఈమె చేయు పురుషకారమున కేవిధమైన ప్రతిబంధకముండదు. నిరంకుశ స్వతంత్రుడైన ఈశ్వరుడు చేతనుల యొక్క యపరాధ శతములను వారలచే ననుభవింప జేయదలచి నప్పుడా పిరాట్టి తన పురుషకారముచేతను రక్షింపజేయగలదా యంటే, ఆమె యొక్క సౌందర్యాదులందతిముగ్ధుడైయుండు తన భర్తను చిత్రోపాయములచేత క్షమింపజేయునని చెప్ప నక్కఱలేదు. ఈమెయొక్క సౌందర్యాతిశయమునకు లోబడియేగదా తన కురాగల యనర్థము నైనను విచారింపక, మాయామృగము వెంట ధనుర్బాణములతో బయలు వెడలెను. రావణవధానంతరమందు పిరాట్టికి శుభవార్త చెప్పుటకు వచ్చిన తిరువడి

యునగా, ఆంజనేయులు దాను మొదట వచ్చినప్పు డీమెను బాధపెట్టుచు వచ్చిన రాక్షసస్త్రీలను చిత్రవధఁజేయుటకు తల వడుగగా ననేక ప్రకారముల చేత నాంజనేయునకు బోధపఱచి క్షమింప జేసినది శ్రీ మద్రామాయణములో జెప్పబడి యున్నది.

14. ఇందువలన తిర్యగ్జాతీయుడై చెప్పినట్లువినక పట్టు బట్టివిడువక పోవుటయే స్వభావముగాగల హనుమంతు నే లోబరచుకొన్న యీమెకు తనయందు మిక్కిలి ప్రేమగల యీశ్వరుని స్వాధీన పరచుకొనుట యతిసులభము. ఇది శ్రీమ త్పదమందలి ప్రకృత్యర్థము. ఇఁకను ప్రత్యయార్థమునగా (మత్) అనుదానికర్థము జెప్పబడుచున్నది.

15. ఈ (మత్) యను ప్రత్యయమునకు నిత్యయోగ మర్థము. దీనిచేత పురుషకార భూతురాలగు పిరాట్టియును ఉపాయభూతుడైన యీశ్వరుడును, అన్యోన్యము విడువకుండా సంశ్లేషించి యుండుననగా కలిసి యుండునట్టి యునికి జెప్పబడు చున్నది.

16. ఈశ్వర స్వరూపమునకు నిరూపకమైనజ్ఞానానం దామలత్వాదులకంటే శ్రియఃపతిత్వము ప్రధాన నిరూపక మగుటచేత భాష్యకారులవారీశ్వరస్వరూపమును నిరూపించు నప్పు డాజ్ఞానానందాదులకంటే ముందుగా నీ శ్రియఃపతి త్వమును గీతాభాష్యములో సాయించి యుండుటవల్ల స్వరూప

నిరూపకురాలైన ఈమెతో కూడియే ఈశ్వరుని యొక్క యునికని చెప్పబడును.

17. స్వరూప ప్రయుక్తమగు నిత్యయోగ మిది వఱకు జెప్పబడినది ఇకను గుణప్రయుక్తమగునిత్యయోగము జెప్పబడును చేతనుని యొక్క యపరాధశతముల నన్నింటిని యనుభవింప జేసియే రక్షించుదునని సంకల్పించుకొన్న ఈశ్వరుని స్వాతంత్ర్యమునున్ను, అనేకబ్రహ్మకల్పము లనుభవించినను తరగని చేతనుని యపరాధములనున్ను జూచి ఈ చేతనునకేమిహానిసంభవించునో యను భయముచేత నీమె ఈశ్వరుని యొక క్షణమైనను విడువజాలదు.

18. పిరాట్టియొక్క నిత్యసాన్నిధ్యమున్నది గనుక నీశ్వరుని యొక్క స్వాతంత్ర్యమునున్ను తన యొక్క యపరాధములనున్ను జూచి చేతనుడు భయపడవలసిన పని లేదు.

19. పురుష కారోపాయభూతులైన శ్రీ శ్రియఃపతుల యొక్క నిత్యయోగమును జెప్పుచున్న ఈ మతుపు చేతనునికి భగవదాశ్రయమందు రుచిపుట్టుటయే కావలశినది గాని, యాశ్రయించుటకు కాలనిరీక్షణము చేయనక్కఱ లేదని చెప్పబడుచున్నది.

20. కాకాసురుడీమె విషయమై చేసిన మహాపరాధమునకు గోపించి బ్రహ్మాస్త్రము బ్రయోగించి శిరచ్ఛేదనమొనర్చుటకు సిద్ధపడి యుండగా, నీమె స్వామిసన్నిధినున్న

సమయమందున ఆకాకాసురుడైనను దీనతతో బడిన మాత్రముచేతను ఈమె పురుషకారముచేతనే స్వామికృపకు పాత్రుడై రక్షింపబడెను. రావణుడు వీని యపరాధము కంటె తక్కువ యపరాధమొనర్చిన వాడైనను, రక్షకాంతర శూన్యుడై యుండినను, ఆమె సన్నిధిని లేని సమయమందగుట పడుటచేత నీమె పురుషకారము లేక నశించిపోయెను. గనుక నీమె పురుషకార మావశ్యకము.

21. ఇక (నారాయణ) పదముయొక్క యర్థము చెప్పబడును. ఆశ్రయించుటకు వచ్చిన చేతనుడు జేసిన మహాపరాధమును జూచి కోపించి శిక్షింప నుద్యోగించిన యీశ్వరుని యొక్క స్వాతంత్ర్య మీమె యొక్క పురుషకారమునకు లోబడిపోయి యిదివరలో నీ స్వాతంత్ర్యముచేతను గ్రొక్కివేయబడి తిరుగ విజృంభించిన వాత్సల్యాది గుణముల నీ నారాయణపదము జెప్పుచున్నది.

22. ఆగుణము లేవనగా ఒకటి వాత్సల్యము, రెండు స్వామిత్వము, మూడు సౌశీల్యము, నాల్గు సౌలభ్యము, 1 జ్ఞానము, 2 శక్తి, 3 ప్రాప్తి 4 పూర్తియున్ను, వాత్సల్యాదులునాల్గున్ను, చేతను డీశ్వరు నాశ్రయించుట కుపయోగించునవి. వీటికాశ్రయణ సౌకర్యాపాదకములని పేరు, జ్ఞానాదులు నాల్గును ఈశ్వరుడు ఈచేతనుని కార్యమును జేయుటకుపయోగించునవి.వీటికాశ్రితకార్యాపాదకములని పేరు. ఒకటి వాత్స

ల్యమనగా అప్పుడీనిన గోవునకుండు ప్రేమాతిశయమనగా, వత్సముయొక్క దేహదోషమును భోగ్యముగా స్వీకరించి పాలిచ్చి పెంచి పసులవలన బాధరాకుండా రక్షించు ధేనువువలనే ఈశ్వరుడు చేతనులయొక్క దోషములను భోగ్యముగా బరిగ్రహించి తన కల్యాణ గుణములతో బెంచి యితరులవలన బాధ రాకుండా రక్షించు గుణము. దీనికి దోషభోగ్యత్వమని పేరు. రెండు స్వామిత్వమనగా స్వామియై యుండుననగా నీచేతనులు విముఖులైన దశయందున్ను వీరలను విడువక సర్వవిధ రక్షణమునకు కారణమైన యొక సంబంధ విశేషము. మూడు సౌశీల్యమనగా గొప్పవారు కొద్దివారలతో తరమరలేకుండా గలసి మెలసియుండే స్వభావము. ఇది యీశ్వరునకు ఉభయవిభూతి నాథత్వము చేతనున్ను శ్రియఃపతిత్వము చేతనున్న, వచ్చిన పరత్వమున్ను, తన యొక్క నీచతనున్ను. చూచి ఆశ్రియణోన్ముఖులైన చేతనుడు భయపడి వెనుతీయక పోవుటకు ఉపయోగించు గుణము, నాలుగు సౌలభ్యమనగా సులభత్వము ఇది కంటికి గోచరముగాని సర్వేశ్వరుడు చేతనునియొక్క కంటికగుపడి యాశ్రియింపదగినట్లు సర్వసులభుడైయుండు గుణము. జ్ఞానమనగా, సర్వజ్ఞత్వము అనగా చేతనునికి పోగొట్టవలసిన విరోధులనున్ను యివ్వవలసిన ఫలమునున్ను ప్రత్యక్షముగా జూడదగిన సామర్థ్యము. రెండు శక్తి యనగా అఘటిత ఘటనా సామర్థ్య మనగా నిత్య సంసారులను నిత్యసూరు

లత్తో సమానముగా జేయదగిన సామర్థ్యము. మూడవ ప్రాప్తి యనగా శేషశేషిభావ సంబంధము. నాలుగు పూర్తి యనగా అవాప్తసమస్త కామత్వము. అనగా నేవిధమైన లోపములు లేకుండా సర్వసంపన్నుడై యుండుట.

13. ఆశ్రయణోన్ముఖుడైన చేతనుడు తన దోషములనుజూచి భయపడకుండా యుండుటకు దోషభోగ్యత్వమనెడు వాత్సల్యము హేతువగును. ఈశ్వరుడు తన కార్యమును జేయునో జేయడో యని సంశయించక చేయునని నమ్ముటకు స్వామిత్వము హేతువగును. ఉభయ విభూతి నాయకత్వమునకు ప్రకాశకమైన యీస్వామిత్వమునుజూచి తనవంటి నీచుల కింత గొప్ప శ్రీహరియొక్క యాశ్రయణము దుర్ఘటమని వెంచి విడువకుండా యుండుటకు సౌశీల్యము హేతువగును. ఈశ్వరుడు కంటికి గోచరుడు గాడని యుపేక్షింపక కంటితో జూచి యాశ్రయించుటకు సౌలభ్యము హేతువగును. విరోధులను బోగొట్టి భగవదనుభవము మొదలైన ఫలములనిచ్చుటకు జ్ఞాన శక్త్యాదులు హేతువు.

24. ఈపదమందు జెప్పబడిన సౌలభ్యము వాత్సల్యాదుల కంటె ప్రధానమగు గుణము. ఆగుణ మర్చావతారమందే పూర్తిగా నున్నది.

25. పరవ్యూహములు మిక్కిలి దూరమగుట చేతను కంటికిగోచరముగాక దుర్లభములై యుండును. ఈయర్చావతా

రముల్లుగాక కంటికి గోచరముగునట్లు సర్వదా సమీపమందుండి మిగుల సుఖముగా నుండును.

26. ఆశ్రయణ సౌకర్యాపాదకములుగాను ఆశ్రితకార్యాపాదకములుగాను జెప్పబడిన యీగుణములన్నియు మనము మన పెరుమాళ్ళసన్నిధిని చూడదగినట్లుగా ప్రత్యక్షముగా గనబడుచున్నవి.

27. మన తిరువారాధనలో వేంచేసియున్న పెరుమాళ్ళు ధరించియున్న శంఖ చక్ర గదా ద్యాయుధములు జ్ఞానశక్తులనున్ను, అభయహస్తము వాత్సల్యమునున్ను, కిరీటము స్వామిత్వమునున్ను, చిరునవ్వుతో గూడియున్న ముఖము సౌశీల్యమునున్ను, సింహాసనమందున్న తిరువడిఘళ్ సౌలభ్యమునున్ను ప్రకాశింపచేయుచున్నవి. గనుక వీటితో గూడుకొన్న అర్చావతారమే మనకు రక్షకము.

28. ఆయుధములతోనున్ను ఆభరణములతో నున్ను వేంచేసియున్న యీసుందర విగ్రహమునందె రక్షకత్వభోగ్యత్వములు రెండున్ను ప్రకాశించుచున్నవి. ఇటుపైని, చరణశబ్దార్థము జెప్పబడును.

29. "చరణౌ" అను పదమునకు తిరువడిఘళ్ అనునర్థము. ఇది ద్వివచనము.

30. రెండు తిరువడిఘళులను జెప్పుచున్న యీ ద్వితీయాద్వివచనముచేత నొక్కటియై యుండక రెండు తామరప

ద్మములవలె జోడుగా నున్నందువల్ల గలుగు సౌందర్యాతిశయము మున్ను బహువచనమువలె ద్వివచనము రెంటికంటె మరి యొక దానిని సహించక పోవుటనుబట్టి ఉపాయపూర్తియును జెప్పబడుచున్నవి.

31. పురుషకార భూతురాలగు పిరాట్టియు యుపాయభూతుడగు సర్వేశ్వరుడును ఎప్పుడైనను చేతనులను విడిచిన ప్పటికిని ఈ తిరువడిఘుళ్ళు తమసౌందర్యాది వైలక్షణ్యము చేత చేతనులయొక్క మనస్సుల నాకర్షించి యెన్నడును విడువక వీరి రక్షణమును దృఢముగా నవలంబించి యుండును.

32. వత్సజననమైన వెంటనే తల్లియొక్క యవయవాంతరము లుండినప్పటికిని తనకు తారకమైన క్షీరములతో గూడి యున్న స్థలమందు నోరుంచునట్లు శేషభూతుడైన ఈ చేతనుడును సర్వేశ్వరునియొక్క యవయవాంతరములున్నప్పటికిని "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" యను ఈ శ్రుతిప్రకారముగా దనకు తారకమైన యమృతమును స్రవించు తిరువడిఘుళ్ళనే యాశ్రయించుట యుచితము. (విష్ణోః=వ్యాపకుడైన సర్వేశ్వరుని యొక్క పరమే=సౌందర్యాదులచేత సర్వోత్కృష్టమైన, పద=పాదమందు మధ్వఉత్సః=అమృతప్రవాహము గలదు)

33. విగ్రహములో నొక యవయవమునకు వాచకమైన యీ (చరణ) శబ్దముచేత పిరాట్టికి వాసస్థానమైనటువంటిన్ని వాత్సల్యాది కల్యాణగుణములకు ప్రకాశకమైనటువం

టిన్ని నింద జేయడమే స్వభావముగాగల శిశుపాలుని కూడా తన సౌందర్యములో మగ్నపఱచుకొని ద్వేషమును బోగొట్టి తనసన్నిధిని జేర్చుకొన్నటువంటిన్ని దివ్యమంగళ విగ్రహము జెప్పబడుచున్నది.

34. ఇటుపైని, శరణ శబ్దార్థము చెప్పబడుచున్నది. శరణం అనుపదమున కిష్టప్రాప్తికిని అనిష్ట నివారణమునకును యుపాయముగాననగా సాధనముగానని అర్థము. యీ శరణ శబ్దము రక్షించువానినిన్ని గృహమునున్ను ఉపాయమును న్ను చెప్పచున్నప్పటికిన్ని, యిచ్చట నొకయుపాయమునే అర్థముగా పరిగ్రహింపవలెనని పాంచరాత్రమునందు జెప్పబడి యున్నది.

అనిష్టములనగా 1 అహంకార మమకార రూపమైన అవిద్యయున్ను అనగా ఆత్మ కాని దానియందాత్మ బుద్ధియును, ఆత్మది కానిదానియందాత్మదియను బుద్ధియును ఈ రెండింటిని అవిద్యయని వ్యవహరింతురు. 2. అవిద్యవల్లబుట్టు రాగద్వేషములును. 3. రాగద్వేషములుబుట్టి మనోవాక్కాయముల చేత జేయు పుణ్యపాప రూప కర్మలును. 4 ఆకర్మ ఫలములైన సుఖదుఃఖఫలములనుభవించుటకు పరిగ్రహించెడి దేవమనుష్య మృగాది నానావిధములైన జంగమశరీరములున్ను వృక్షపర్వతాది అనేకవిధములైన స్థావరశరీరములున్ను, శరీరములతో ననుభవించునాధ్యాత్మికాది దుఃఖపరం

పరలు మొదలుగాగలవి. 1. ఇష్టమనగా మోక్షవిరోధులగు పుణ్యపాపములను విడుచుటయును. 2. ఆత్మ హృదయములో నుండి మూర్ధన్య నాడీద్వారా వెళ్లెడు మార్గముయొక్క ప్రకాశమున్ను, 3. హృదయ గుహాలోనుండి బయలు వెడలుటయును అర్చిరాది లోకములయందు గలుగు సత్కారమున్ను, అర్చిరాది లోకమనగా "అర్చిషమేవాభిసంభవంతి అర్చిషోఽహః అహ్న ఆపూర్యమాణ పక్షం ఆపూర్యమాణ పక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాన్ మాసేభ్యస్సంవత్సరం సంవత్సరాదాదిత్యం ఆదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషో అమానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి ఇత్యేషః దేవయానః పంథాః" అని ఛాందోగ్యోపనిషత్పంచమ ప్రపాఠక దశమ ఖండ ప్రథమద్వితీయ మంత్రములలో జెప్పబడినట్లు ముక్తపురుషుడు పరమపదమునకు వెళ్ళుమార్గమందుండు లోకములు. ముక్తుడు హృదయములోనుండి మూర్ధన్య నాడీమార్గముగా బయలు వెడలి అర్చిర్లోకమున్ను దినలోకమున్ను శుక్లపక్ష లోకమున్ను సూర్యుడే అయనమం దుత్తరముగా సంచరించునో, ఆయుత్తరాయణ లోకమున్ను సంవత్సరలోకమున్ను ఆదిత్య లోకమున్ను చంద్రలోకమున్ను విద్యుల్లోకమున్ను అమానవ పురుషునిన్ని పొంది ఆయాలోకాభిమానులచేత సత్కరింపబడి పరమపదమును బొందునని శ్రుతితాత్పర్యము. ఈ లోకములేగాక మరికొన్ని లోకములు

గూడా ఈ మార్గమునందున్నట్లు శ్రుత్యంతరములందు గనబడుచున్నవి. 5. బ్రహ్మాండమునకుజుట్టుకొనిన సలిల దహనపవనాది సప్తావరణములను దాటుటయును. 5 సత్త్వరజస్తమోగుణాత్మకమైన మూలప్రకృతిని దాటుటయును. 7. విరజానదిలో స్నానమొనర్చుటయును 7. సూక్ష్మశరీర త్యాగమున్ను అమానవకర స్పర్శమును లభించుటయును . 10, "అపహతపాప్మావిజరో విమృత్యు ర్విశోకోవిజిఘత్సో అపిపాసఃసత్యకామః సత్య సంకల్పః" ఇత్యాది శ్రుతులందు జెప్పబడిన అష్టగుణములతో గూడిన యాత్మస్వరూప మావిర్భవించుటయును, పంచోపనిషన్మయమైన దివ్యదేహము నొందుటయును ఐరంమదీయమను నమృత తటాకమునకు వెళ్ళుటయును "తం పంచశతమప్సరసాం ప్రతిధావంతి" యను శ్రుతిలో జెప్పిన ప్రకార మయిదువందల యప్సరస స్త్రీలచేత నెదుర్కొనబడుటయు నీశ్వరునితో సమానముగా వారివల్ల నలంకరింపబడుటయును బ్రహ్మతేజస్సు నొందుటయును 16 దివ్యగోపురములోనికి వెళ్ళుటయును. 17. నిత్యసూరులచేత నక్కడ నెదుర్కొనబడుటయును. 18. రాజమార్గము వెంబడిని బయలు వెడలివెళ్ళుటయును, 19. ఈశ్వరగృహమందు బ్రవేశించుటయును. 20 అక్కడనున్న దివ్యమండపముమీదికి వెళ్ళుటయును. 21. కౌషీతక్యోపనిషత్తు నందు పర్యంక విద్యలో జెప్పబడిన ప్రకారముగా నేంచేసియున్న దివ్యదేశ పర్యంక మనంగా శేషపాన్పును సేవించుటయును, 22. సపత్నీకుడైన

సర్వేశ్వరుని సేవించుటయును. 23. వానిసన్నిధికి వెళ్ళుటయును 24. ఈశ్వరపాదపీఠముమీఁద కెక్కిన తరువాత పర్యంకముమీఁద కెక్కి స్వామియొక్క తొడమైకూర్చుండుటయును 25. అన్యోన్యాపేక్షణమును 26. అన్యోన్య సంభాషణమును, 27. భగవదనుభవమును. 28. అనుభవమువల్లబుట్టిన సంతోషాతిశయము న్ను. 29. ఆసంతోషాతిశయముచేత కైంకర్యోపయుక్తమైన యనేకరూపములను బరిగ్రహించి సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును సర్వవిధ కైంకర్యముల జేయుటయును వీటియన్నిటిలో నీశ్వర కైంకర్యము ప్రధానయిష్టము. తక్కినవి దీనికంగములు.

35. శ్రీమన్నారాయణ "చరణౌ" యను పదము చేత జెప్పబడిన ఈశ్వరునే శరణం యనుపదములో నుపాయముగా ననగా సాధనముగా జెప్పబడుటవలనను, చేతనుని చేత నొందబడు ఫలమందుకు సాధనమున్ను యగుచున్నది. శ్రీమన్నారాయణ చరణౌ అను మూడుపదములచేత జెప్పబడిన శ్రియఃపతిత్వము కల్యాణగుణత్వము నిత్యవిగ్రహత్వమనెడు మూడున్ను ప్రాప్యములే గనుక వీటితోగూడిన ప్రాప్యుడైన సర్వేశ్వరు నుపాయముగా శరణశబ్దము జెప్పుచున్నది

36. ప్రాప్యుడైన సర్వేశ్వరుని సాధనము యనుటకు హేతువేమనగా నీశ్వరేతరులు ఫలసిద్ధి కుపాయము గాక పోవుటచేతనున్ను ఈశ్వరపరతంత్రుడైన తానాఫలసిద్ధికొఱకు స్వతంత్రోపాయము జేయుట స్వరూపవిరుద్ధమని తెలుకొని

యుపాయశూన్యుడై యుండుటచేతనున్ను ప్రాప్యుడైన యీశ్వరునే యుపాయముగా జేసికొనుచున్నాడు.

37. ( శ్రీమన్నారాయణచరణౌశరణం ) అని ప్రాప్యుడైన సర్వేశ్వరుని ప్రాపకముగా జెప్పిన దీనివల్ల ప్రాప్యుడైన ఈశ్వరునికంటె వేరుగానుండు కర్మజ్ఞాన భక్త్యాద్యుపాయముల కంటె ఈ యుపాయము మిగుల విలక్షణమైనదని చెప్పబడుచున్నది.

38. ఇటుపైని ప్రపద్యేయను క్రియాపదమున కర్థము జెప్పబడును. ప్రపద్యే యను పదము పదగతౌ యను ధాతువు నుండివచ్చినదికాబట్టి గతిని జెప్పుచున్నది. ఇది ఉత్తమపురుష కాబట్టి పొందుచున్నాను అనగా నాశ్రయించు చున్నానని యర్థము.

39. ఈపదము మానస వాచిక కాయిక రూపమైన త్రివిధ గతినిన్ని చెప్పతగినదై నప్పటికిని, యిచ్చట మానసికమే ముఖ్యము. ఎందుకంటే నీవే రక్షించుమని రక్షకుడున్న స్థానమునకు వెళ్ళి అంజలిచేయుట మొదలైన కాయికప్రవృత్తిచేసినప్పటికిన్ని ఫలసిద్ధికి లోపములేక పోయినను, భారతాదులయం దధ్యవసాయరూపమైన జ్ఞానముచేతనే మోక్షమని చెప్పబడుటచేతను మానసికాధ్యవసాయరూపమైన ప్రపత్తియే ముఖ్యము. ఈ యధ్యవసాయమనునది యనన్యార్హ శేషత్వ జ్ఞానాంతరమందుబుట్టి కర్మజ్ఞానాదిసాధన

ములకంటె విలక్షణమైనదై దేవతకుకూడా తెలియశక్యము గానిదై భగవంతుని రక్షకత్వానుమతిరూపమై యనగా భగవంతుడు రక్షించుటచే రక్షణమున కొప్పిదమై యొక్క పర్యాయ మాచరించవలసినదై ఫలమునకు దప్పకుండా శీఘ్రముగానై వర్ణాశ్రమాది నియమములులేకుండా యందరిచేతను నవలంభింపదగినదై పరతంత్రమైన యాత్మస్వరూపమునకు విరుద్ధముగానిదై దేశకాలాదినియమములులేనిదై మరణసమయమందీశ్వరునియందు స్మృతియుంటేనేకానివల్లకాదనే నియమము లేనిదై బహుసులభమైనదై దృఢాధ్యవసాయరూపమైయుండు జ్ఞానవిశేషము.

40. చేతనున కపేక్షితమైనఫలసిద్ధి కుపాయముగానాశ్రయింపబడువాడుయీశ్వరుడేయగుటచేతనున్ను కరణత్రయము చేతనాశ్రయింపునాశ్రయములు నామత్వఉపాయములుగానిసాక్షాదుపాయములు గాకపోవుటచేతనున్ను యీకరణత్రయమున్ను యుండవలెననే నిర్బంధములేదు. కరణత్రయముచేతనైన ప్రపత్తియుండినయుండవచ్చును. ఫలసిద్ధికిమాత్రిము ఏకకరణప్రపత్తియే చాలును. ఈశ్వరునియొక్క యుపాయవృత్తికి, శ్రియఃపతిత్వమున్ను యపేక్షితంబైనట్లు యధికారపూర్తికి కరణత్రయ ముండవలయును.

41. భూతభవిష్యదర్థకములైన క్రియలతో జెప్పక "ప్రపద్యే" యని వర్తమానార్థక క్రియాపదముతో ప్రపత్తిని జెప్పా

టకు హేతువేమనగా ప్రపత్తినొక్క పర్యాయమే చేయవలసిన దని పాంచరాత్రమునందు చెప్పబడుటచేతనున్ను ఆప్రపత్తిని జేసినతరువాతయీ చేతనుడుప్రకృతివశ్యుడై అజ్ఞానముచేత నిషిద్ధకార్యములను జేయునప్పుడు పరితాపముబుట్టి ప్రాయశ్చిత్తము జేసుకొనవలయుననే యుద్దేశము గలిగినయెడల నీప్రపత్తియే తప్ప ప్రాయశ్చిత్తమొకటి వేరే లేకపోవుటచేతనున్ను ఈ ప్రపత్తి రెండుపర్యాయములు జేయగూడదు కనుకనున్ను పూర్వము జేసినప్రపత్తినే స్మరించుకొనుటకై వర్తమానక్రియతో జెప్పబడినది.

42. పూర్వవాసనచేత కర్మజ్ఞానాదిరూపమగు స్వతంత్రోపాయములందు మనస్సు వెళ్ళకపోవుటకున్ను యీద్వయానుసంధానముతో దప్ప కాలము వెళ్ళింపశక్యముగాకపోవుటచేతనున్ను కాలముగడుపుటకున్ను దీనియందుండెడు భోగ్యతనుబట్టి దీనినివిడువ శక్యముగాకపోవుటచేతనున్ను యీవర్తమానార్థక్రియ బ్రయోగింపబడినది.

43. ఈవర్తమానక్రియ యుండుటకు క్రిందజెప్పిన హేతువు లంగీకరింపక నసేకపర్యాయము లనుసంధించితేనే తప్ప ఫలసిద్ధికాదుగనుక యిందునిమిత్తమై ఈ వర్తమానక్రియయుంటున్నదని తెలంచిన పక్షమున బ్రథమమునజేసిన ప్రపత్తియందు ఇంద్రజిత్తునకు బ్రహ్మాస్త్రమందువలెనే విశ్వాసము లేనివాడగుచున్నాడు.అందువల్లసిద్ధోపాయఫలము లేకజారిపోవు

నెట్లంటే ఇంద్రజిత్తు హనుమంతునిగట్టుటకై బ్రహ్మాస్త్రమును బ్రయోగించి యాబ్రహ్మాస్త్రమును నమ్మక త్రాళ్ళతోగట్టుట చేత నాబ్రహ్మాస్త్రము దాను చేయవలసిన పనిని ప్రథమములో జేసినను తనయందు వీనికి విశ్వాసము లేకపోవుటచేత మరేమి యు పనిచేయక జారిపోయినట్లు జారిపోవును.

44. ఇటుపైనిఉత్తరవాక్యార్థము జెప్పబడును. (శ్రీమతే నారాయణాయనమః) అను యుత్తరవాక్యముచేతను శ్రియః పతియై సర్వస్వామియైన సర్వేశ్వరునియొక్క తిరువడిగళు నందు జేయు కైంకర్యము జెప్పబడుచున్నది.

45. పూర్వవాక్యమందు చెప్పబడిన సిద్ధోపాయము 1. ఇహలోకపరలోకైశ్వర్యములు 2. కైవల్యము 3 భగవత్ప్రాప్తియుననెడి ఫలములకు సమానసాధనమైనప్పటికిని యీప్రపన్నుడు జేయు సిద్ధోపాయ వరణరూపమైనప్రపత్తిభగవత్కైంకర్యరూప ఫలమునకే గాని ఐశ్వర్యాది రూపమైన ఫలాంతరములకుగాదని ఉత్తరవాక్యము జెప్పుచున్నది.

46. ప్రాప్యాంతరములను విడిచిపెట్టి భగవత్కైంకర్య రూపమైన ప్రాప్యమును ప్రార్థించుటకు హేతువేమనగ యుపాయమవలంబించునప్పు డనన్యశరణ్యత్వరూపమైన యాత్మస్వరూపమునకు విరుద్ధమైన కర్మజ్ఞానాదిరూపోపాయాంతర ములను విడిచిపెట్టి అనుగుణమైన సిద్ధోపాయమవలంబించినట్లు ఫలమును బ్రార్థించు సమయమందున్న అనన్యభోగ్యత్వరూప

నెట్లంటే ఇంద్రజిత్తు హనుమంతునిగట్టుటకై బ్రహ్మాస్త్రమును బ్రయోగించి యాబ్రహ్మాస్త్రమును నమ్మక త్రాళ్ళతోగట్టుట చేత నాబ్రహ్మాస్త్రము దాను చేయువలసిన పనిని ప్రథమములో జేసినను తనయందు వీనికి విశ్వాసము లేకపోవుటచేత మరేమి యు పనిచేయక జారిపోయినట్లు జారిపోవును.

44. ఇటుపైనిఉత్తరవాక్యార్థము జెప్పబడును. (శ్రీమతే నారాయణాయనమః) అను యుత్తరవాక్యముచేతను శ్రియః పతియై సర్వస్వామియైన సర్వేశ్వరునియొక్క తిరువడిగళు నందుజేయు కైంకర్యము జెప్పబడుచున్నది.

45. పూర్వవాక్యమందు చెప్పబడిన సిద్ధోపాయము 1. ఇహలోకపరలోకైశ్వర్యములు 2. కైవల్యము 3 భగవత్ప్రా ప్తియుననెడి ఫలములకు సమానసాధనమైనప్పటికిని యీప్ర పన్నుడు జేయు సిద్ధోపాయ వరణరూపమైనప్రపత్తిభగవత్కైం కర్యరూప ఫలమునకే గాని ఐశ్వర్యాది రూపమైన ఫలాంత రములకుగాదని ఉత్తరవాక్యము జెప్పుచున్నది.

46. ప్రాప్యాంతరములను విడిచిపెట్టి భగవత్కైంకర్య రూపమైన ప్రాప్యమును ప్రార్థించుటకు హేతువేమనగ యుపాయమవలంబించునప్పు డనన్యశరణ్యత్వరూపమైన యా త్మస్వరూపమునకు విరుద్ధమైన కర్మజ్ఞానాదిరూపోపాయాంతర ములను విడిచిపెట్టి అనుగుణమైన సిద్ధోపాయమవలంబించినట్లు ఫలమునుప్రార్థించు సమయమందున్ను అనన్యభోగ్యత్వరూప

మైన యాత్మస్వరూపమునకు విరుద్ధమైన యైశ్వర్యాదిరూపఫల ములను విడిచిపెట్టి ఆ స్వరూపము కనుగుణమైన పరమపురు షార్థమనెడు భగవత్కైంకర్యము యుత్తర వాక్యమందలి చతుర్థి చేత ప్రార్థింపబడు చున్నది.

47. చేతనునియొక్క యభిప్రాయమును దెలుసుకొను టకు దగిన సర్వజ్ఞత్వముగల సర్వేశ్వరుని సన్నిధిని వేరేవీడు ప్రార్థింపవలెనా? వాడెరుగడా? యంటే, క్రింద తెలుపబడును.

48. వీడు ప్రార్థించు కైంకర్య ప్రార్థన యనునది సర్వజ్ఞుండును, సర్వేశ్వరుడైన భగవంతుండెరుగడని కాదు రోగస్థుడైన పుత్రుడన్న మందిచ్ఛలేక కొంతకాలముపడి యుండి ఔషధాదులచేత నారోగముదీరి ఆకలిపుట్టి తల్లిని యన్నమడిగితే ఆ పలుకు తల్లికెంత సంతోషకరముగా నుండు నో, అనాది కాలమునుండి విషయాంతరాసక్తిచే రోగగ్రస్తు డై భోగ్యమైన భగవత్కైంకర్యమందు వాంఛలేక పడియున్న చేతను డాచార్యోపదేశాదిరూపమైన యౌషధములచే నా వ్యాధి శాంతించి, కైంకర్యమందు రుచిపుట్టి, దానిని గురించి ప్రార్థించితే ఈశ్వరున కపరిమిత సంతోషమగును. అహే తువుచే ప్రార్థన మావశ్యకము.

49. (శ్రీమతే) యనుపదముదానికి పూర్వవాక్యమున జెప్పబడిన వ్యుత్పత్తిద్వయముచే నీశ్వరునికిన్ని పిరాట్టికిన్ని యుండు నిత్యయోగమును దెలుపుచున్నది.

50. ఈపదమునకు పెరియపిరాట్టితో కూడియున్న వాని కొఱకని యర్థము.

51. ఈశ్వరుడు చేతనునకు ఫలసాధనమైనప్పుడీమె తానుకూడా యుపాయము గాకుండా పురుషకారమైయుండి ఆయన ప్రాప్యుడైనప్పుడు తానున్ను ప్రాప్యురాలగుటకున్ను వీడు చేయు కైంకర్యమును స్వామికి భోగ్యమగునట్లు చేయుటకున్ను తనకు ధారకమైన భగవదనుభవము కొఱకున్ను ఆయనతో గలసి యుండుటను (శ్రీమత్) పదము జెప్పుచున్నది.

52. కైంకర్యమును ప్రతిపాదింపుచున్న తిరుమంత్రమందలి నారాయణపదమున కీయుత్తర వాక్యమైన "శ్రీమతే నారాయణాయనమః" అనునది వివరణమగు చున్నది. ఎట్లనిన, తిరుమంత్రమందలి నారాయణపదము నారాయణునికే కైంకర్యము జేయవలెనని మాత్రము జెప్పుచున్నది. ఈ యుత్తరవాక్యములో కైంకర్యమును దివ్యదంపతులకు విశిష్టుడు గావలెననిన్ని కైంకర్యము జేయువాడు అహంకార మమకార శూన్యుడై యుండవలెనిన్ని విశదపరచి యుండుటచే నా పదమున కీవాక్యము వివరణమని తెలుసుకొనదగి యున్నది.

53. చక్రవర్తి తిరుమకునారనగా శ్రీ రాములవారు వన వాసమునకు వేంచేయునపుడిళయ పెరుమాళ్ళనగా లక్ష్మణ

58. కళ్యాణ గుణములన్నియు ప్రాప్యములగుటచేత నీపదమందు వాటినన్నిటిని చెప్పతగియున్నను, చతుర్థిలో జెప్పబడు కైంకర్యమున కావశ్యకముగా కావలసినది శేషిత్వ మగుటచేత శేషిత్వమునే యిచి ప్రధానముగా జెప్పెను.

59. ఈ నారాయణ పదమందు శేషిత్వప్రాధాన్యము జెప్పుటకు హేతువేమనగా శాస్త్రమందు నిషేధింపబడిన అప్రాప్తవిషయ కైంకర్యములలె గాకుండా శాస్త్రమందు విధింపబడి ప్రాప్తమైన ఈ శేషి విషయమైన కైంకర్యమే మిగుల రుచించుట వలన శేషిత్వమే ప్రధానముగా జెప్పబడ్డది.

60. ఈ పదము చతుర్థీ శేషత్వ జ్ఞానకార్యమైన సిద్ధోపాయ పరిగ్రహమును జెప్పుచున్న "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" అను పూర్వ వాక్యమున కనంతర ముందుండుటచేత శేషత్వమును జెప్పక ఉపాయ ఫలమగు కైంకర్యమును ప్రకాశింప జేయుచున్నది. అనగా కైంకర్య ప్రార్థనను ప్రతిపాదింపుచున్నది. కైంకర్యమనగా నీశ్వర కైంకర్యము. అది ఈశ్వరముఖ వికాస హేతువైన కరణత్రయ వ్యాపారము.

61. కైంకర్యము ప్రార్థించి లభింపవలసినదప్పు డది నిత్యము కాకపోవునే యంటిరేని, శేషత్వమే ఆత్మ స్వరూప

మగుటచేతనున్ను కైంకర్యము లేనప్పుడు శేషత్వ సిద్ధి లేదని చెప్పుటచేతనున్ను శేషత్వ సిద్ధ్యర్థమై ఆత్మకు కైంకర్యము స్వరూపముతో బాటు నిత్యమైయుండును.

62. కైంకర్యము నిత్యమైనయెడల తిరుగ ప్రార్థనయెందుకంటె కైంకర్యమునకు ప్రతిసంబంధియైనవాఁడు యుత్కృష్టుండగుటచేతనున్ను కైంకర్యమును చేయు చేతనుడు బహు నికృష్టుడును పరతంత్రుడు నగుటచేతనున్ను ఈ కైంకర్యము నిత్యమైనను సదా ప్రార్థించే పొందవలయును.

63. ఈ కైంకర్యము నిత్య ప్రార్థనీయము కావడమునకు హేతు వేమనగా శేషికి సంతోషమును బుట్టింపని వస్తువునకు శేషత్వము లేక పోవునుగనుక నా శేషి సంతోషము నిమిత్తమై తాను చేయు వ్యాపార విశేషముల చేత తన శేషత్వ స్వరూపలాభమున్ను శేషియొక్క ముఖోల్లాసమును తాననుభవించడ మనెడి ప్రాప్యలాభమున్ను కావలసియున్నది. గనుక నీ కైంకర్యము నిత్య ప్రార్థనీయమయ్యె యుండెను.

64. ఇటుపైని (నమః) పదమున కర్థము జెప్పబడును. (నమః) యనగా (మః నఽనాదికాదు) అని యర్థము. దీనివల్ల అహంకార మమకార నివృత్తి జెప్పబడు చున్నది.

65. ఈ నమః పదము సామాన్యముగా నహంకార మమకార నివృత్తిని జెప్పుటచేత తిరుమంత్రమందలి నమః పదము వలెనే స్వరూపోపాయ పురుషార్థములయందలి విరోధు

లను మూడింటిని తీసివేయు దగినదైనప్పటికిన్ని ఈ స్థలమందు కైంకర్య విరోధులను మాత్రము దీసివేయుచున్నది. తక్కినవా టిని దీసివేయబనిలేదు. అవి ఇంతకు పూర్వమే నివర్తించినవి.

66. కైంకర్యమునకు విరోధి యేదంటే కైంకర్యము తన రుచికనగా స్వప్రీత్యర్థమై చేయబడుటయును మదీయత్వ బుద్ధితో చేయుటయు నీ రెండున్ను కైంకర్య విరోధులు.

67. అహంకార మమకార నివృత్తిని బ్రార్థించుచున్న యీ (నమః) పదమందే దేహాత్మాభిమాన స్వస్వాతంత్ర్యాభి మానరూపమైన అవిద్యయున్ను దానివలనబుట్టుపుణ్యాపాపరూప కర్మలున్ను కర్మలవల్ల గలు దేహసంబంధమున్ను యీసమస్త విరోధులున్ను పోగొట్టబడుచున్నవి. భాష్యకారులవారు గద్య త్రయములో [నమః] పదార్థమును వివరించునప్పుడు మూడు చూర్ణికలచే అవిద్యాకర్మదేహసబంధ నివృత్తినే ప్రార్థించిరి.

68. ఈచేతనుడు కైంకర్యము జేయునప్పుడుండవలశిన ప్రకారమెద్దియనగా శూడికొడుత్తనాచ్చియారు (ఆండాళ్) కృ ష్ణునియందు భక్త్యతిశయమునుంచితదేకభావనచేదననొక గోపికా భావనచేసుకొని గోపికలుప్రార్థించినప్రకారముగా దాను కైంక ర్యముకై ప్రార్థించుసమయమందు కేవలము మాసంతోషమునకు గారణమైనట్టిన్ని మనయుభయులకున్ను సంతోషకరమైనట్టి కైం కర్యమునుచేయక, కేవల మీశ్వర సంతోషమునకే హేతు వైనకైంకర్యమును చేతుమనినప్రకారముగా శేషి కేయుపయుక్త మగు కైంకర్యమును జేయవలయును. ఇందువలన నీ [నమః]

పదమునకు స్వప్రయోజన నివృత్తిప్రార్థనయే ప్రధానార్థము గాగనబడుచున్నది.

69. భగవత్కైంకర్యమునకు విరోధు లిదివరకు చెప్పబడినవి. విఘ్నము లిటుపైని జెప్పబడును. ఎట్లన యీశ్వరునియొక్క దివ్యమంగళవిగ్రహ సౌందర్యమున్ను చేతనులయొక్క దృష్టిచిత్తముల నపహరించివేసి వారుచేయుకైంకర్యమును మరిపించున దగుటచేత కైంకర్యమున కదియును విఘ్నమే. యీ నమఃపదమునకుముందుండు చతుర్థీవిభక్తియందు జెప్పబడిన కైంకర్యమున్ను అహంకార మమకార నివృత్తికి బూర్వమందు జెప్పబడినది కాబట్టి స్వప్రీతి కుపయుక్తమగుటచేత నీశ్వర ముఖవికాసము నేప్రయోజనముగాగలవారల కదియును విఘ్నమే.

70 [నారాయణాయ] యను చతుర్థియందు జెప్పబడుచున్న కైంకర్యప్రార్థన నిత్యప్రార్థనీయమైనట్లు ఈ నమః పదమందు చెప్పబడుచున్న కైంకర్య విరోధి నివృత్తిప్రార్థనయును యీ లీలావిభూతియందున్ను నిత్యవిభూతియందున్ను సర్వదా యుండవలెను.

71. చేతనుడహంకార మమకారములకు స్థానమగు నీ దేహముతో కూడుకొన్నపుడు గదా స్వభోక్తృత్వము మొదలగు కైంకర్యవిరోధులు పోవలెనని కోరవలసినది. సకల దోషములున్ను నివర్తించి ముక్తదేహమునొంది పరమపదమునకు వెళ్ళియీశ్వర కైంకర్యమును చేయు దశయందున్ను

వానికి విరోధియైన స్వభోక్తృత్వ బుద్ధి యుండునా యంటే పరమపదమందు జేయు భగవత్కైంకర్య దశయందున్ను యీశ్వర స్వరూప గుణములయొక్క యనుభవమువల్ల నొక విధమైన యానంద ముద్భవించును. అందువలన స్వభోక్తృత్వ బుద్ధి పుట్టును. కాబట్టి పరమపదమందున్ను స్వభోక్తృత్వబుద్ధి రూపవిరోధి నివృత్తికై ప్రార్థన మావశ్యకము. ఆ హేతువుచేత నే గుణాద్యనుభవముచేత మాకు గల్గు నానందమందు స్వభోక్తృత్వ బుద్ధి పుట్టినందువల్ల స్వరూపము నశించకుండా దానిని శాంతింపజేయు నౌషధమైనవాడని అట్టిభోక్తృత్వబుద్ధి కీశ్వరుని నౌషధముగా నిత్యముక్తులు ప్రార్థించినట్లాళ్వార్లు సాయించి యున్నారు. కైంకర్యము జేయు దశయందు స్వభోక్తృత్వ బుద్ధిపుట్టి దానిని పోగొట్టుకొనుటకై (నమః) అని ముక్తులను సంధించుమనరని చెప్పబడుచున్నది.

72. ఈ ద్వయమంత్రమందు బాహుళ్యముగా జెప్ప బడు అర్థములు సంగ్రహముగా జెప్పబడుచున్నవి. శ్రీశబ్దము చేత పిరాట్టియొక్క పురుషకారత్వమున్ను, మత్ యను మతు పుచేత నుభయులయొక్క నిత్యయోగమనగా నుభయులెల్ల ప్పుడు గలసియుండుటయున్ను, నారాయణాయ శబ్దముచేత నాశ్రయణ సౌకర్యాపాదకములైన వాత్సల్యాదిగుణములున్ను చరణ శబ్దముచేత దివ్యమంగళ విగ్రహమున్ను శరణశబ్దము చేత నీగుణవిగ్రహాదులలో గూడియున్న శ్రీమన్నారాయణుని

యొక్క యుపాయత్వమున్ను, ప్రపద్యే యను క్రియాపదము చేత సధ్యనసాయ రూపమగు నుపాయ స్వీకారమున్ను, శ్రీమతే యను పదముచేత నుపాయఫలమైన కైంకర్యమునకు ప్రతిసంబంధ యొకమిథునము నేదిన్ని, నారాయణ పదముచేత సర్వశేషిత్వమును, ఆయ యనుచతుర్థిచేత కైంకర్యప్రార్థనయున్ను, నమః పదముచేత కైంకర్యవిరోధి నివృత్తియున్ను చెప్పబడుచున్నవి.

ముముక్షుప్పడి అను తిరుమంత్రార్థమునందు
ద్వయ ప్రకరణము
ముగిసెను.

శ్రీమతే రామానుజాయ నమః.



ముముక్షుప్పడి

అను

# తిరుమంత్రార్థము.

## చరమశ్లోకప్రకరణము.

మధ్యమరహస్యమైన ద్వయమంత్రములో బూర్వవాక్యములో జెప్పబడుచున్న సిద్ధోపాయ స్వీకారముయొక్క యీశ్వరాభిమతత్వమున్ను, అట్టి సిద్ధోపాయ స్వీకారమునకు నావశ్యకమైనట్టి సాధనాంతర పరిత్యాగమున్ను చేతనునిచే నొనర్పఁబడునట్టి యుపాయ స్వీకారము ఉపాయముకాక పోవుటయున్ను యీ చరమశ్లోకమందలి పూర్వార్థమైన (సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ) అనుదానిచేత ప్రతిపాదింపబడుచున్నది. ద్వయోత్తరవాక్యమున జెప్పబడుచున్న కైంకర్యరూప ఫలప్రాప్తికిమున్ను గలుగవలసిన సకల పాప నివృత్తియున్ను యీ చరమశ్లోకమందలి యుత్తరార్థ

మైన (అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః) అనుదానిచే బ్రతిపాదింపబడుచున్నది. కాబట్టి యీ చరమశ్లోకము ద్వయమాత్ర వివరణమునబడుచున్నది. ఇటులుపైని వాచమ వేదసారమగు భగవద్గీతలకు ముఖ్యతాత్పర్యమైన యీచరశ్లో ముర కర్థము విశదముగా జెప్పబడును. అతిరహస్యమైన యీచరమశ్లోకార్థమును దెలిసికొనుటకై శ్రీభాష్యకారులవారు పదునెనిమిది పర్యాయములు శ్రీరంగమునుండి తిరుకోట్టియ్యూరిలో వేంచేసియుండు తిరుకోట్టియ్యూరునంబిగారి సన్నిధికి వేంచేసియుండిరి. ఆ నంబిగారీ యర్థముయొక్క గౌరవముచేతనున్ను యిందుకుదగిన యధికారులు సామాన్యముగా లేకపోవుటచేతనున్ను భాష్యకారులవారి ఆస్తిక్యమునున్ను ఆదరమునున్ను పరీక్షించిచెప్పుదుమనే తాత్పర్యముగలవారై పదినేడుపర్యాయములు త్రిప్పి పదునెనిమిదవ పర్యాయ మన్యులకు జెప్పనని ప్రమాణము జేయించుకొని మాసోపవాసము చేయించుకొని తరువాత నుపదేశించిరి. ఈ చరమశ్లోకార్థ శ్రవణమునకున్ను అనుష్ఠానమునకున్ను అధికారి పరమసాత్వికుడై పరమాత్మయందే యాసక్తిగలవాడై శ్రుతిస్మృతీతిహాసపురాణాదులయందు నమ్మకముగలవాడై యీశ్వరుని యందు విశ్వాస మునచినవాడై యుండువాడు. అట్టి అధికారి దుర్లభమగుటచేతనున్ను అర్థగౌరవము చేతనున్ను ఈయర్థమును వెల్లడిజేయక భాష్య

కారుల వారికంటే పూర్వులు గోప్యపఱచియుండిరి. భాష్యకారుల వారీ గోప్యయర్థమును తాము దెలిసికొని వెంటనే సంసారులయొక్క యనర్థమును జూడజాలని కృపచేత నీయర్థ గౌరవమున్ను ఆచార్యాజ్ఞోల్లంఘనమువల్ల తమకు రాబోవు అనర్థమునున్ను విచారింపక, యాగ్రామమందున్ను గోపుర మెక్కి అపేక్షించిన వారందరికి నీశ్లోకార్థమును సాయించిరి. యపేక్షించువారి కుపదేశింపుమనిన్ని సాయించి నియమించిరి. భాష్యకారులవారు పరానర్థమును సహింపజాలక స్వానర్థమునకైనా యొప్పుకొని పరమకృపచేత నీయర్థమును వెల్లడి చేసినందుకు తిరుకోట్టియూరు నంబిగారు మిక్కిలి ఆశ్చర్యపడి యట్టి పరసమృద్ధి తమకు లేకపోయినందుకు విచారించి, యిట్టివారు సాక్షాదీశ్వరావతారు లని నిశ్చయించి (ఎంబెరుమానారు అను) తిరునామమును కృపజేసి కాగలించుకొనిరి. (ఎంబెరుమానారనగా) మాస్వామి యని యర్థము. పిళ్ళలోకాచార్యుల వారీయుపదేశ మాత్రముతో తృప్తినొందక నీయర్థ మందరు దెలిసికొని యుజ్జీవింపవలయుననే పరమకృపతో స్త్రీ బాలకులకున్ను దెలియునట్లు విశదముగా నీరహస్యమును సాయించుచున్నారు.

1. ఈశ్లోకముకుచరమశ్లోకమని పేరువచ్చుటకు హేతువేమంటే ఈశ్లోకమునకు బూర్వమనేకాధ్యాయములందు కర్మజ్ఞాన భక్తులనెడి మోక్షసాధనములను శ్రీకృష్ణు డర్జునున

కుపదేశింపగా విని క్రిందజెప్పినయుపాయములలో కర్మ కాయ క్లేశరూప మగుటచేతను, జ్ఞానము ఇంద్రియ నిగ్రహ పూర్వకముగా జేయవలసిన దగుటచేతనున్ను, భక్తి చిరకాల సాధ్య మగుటచేతనున్ను వాటినిజేయ శక్యముగాదనియు, చేయుద మన్నిన నీశ్వరుని కత్యంత పరతంత్రమైన యాత్మస్వరూపమున కీస్వతంత్రోపాయములు విరుద్ధములనియు నాలోచించి, వీటి చేతను ముక్తి గలుగదనియు, నిటుపైని నశింపవలసినదే యని యును దుఃఖించుచున్న యీయర్జునుని శోకనివృత్తి కొఱకు సులభముగా చేయందగినట్టియును, స్వరూపానురూపమైనట్టి దియునింతకుదప్ప వేఱే సాధనము లేదని చెప్పతగినట్లు లీచరమ సాధనమును జెప్పుటచేత నీశ్లోకము చరమశ్లోకమనబడును. చరమార్థ ప్రతిపాదక మగుటచేతనే చరమశ్లోకమనబడు నిం తియెకాని యీగ్రంథముయొక్క యంతమునం దీశ్లోకము జెప్ప బడినందువల్ల కాదు. దీనివెనకకూడా కొన్నిశ్లోకములున్నవి.

2. ఈశ్లోకము యొక్క పూర్వార్థముచేత నుపాయ స్వీకారము జేయు చేతనునియొక్క కృత్యము చెప్పబడున్నది. ఉత్తరార్థముచేత నుపాయభూతుడైన ఈశ్వరునియొక్క కృత్య ము చెప్పబడుచున్నది.

3. చేతను డిచట జేయవలసిన కృత్యము సిద్ధోపాయ పరిగ్రహమునగా తనరక్షణమునకీశ్వరుడే సాధనమని నమ్మి యుండుట.

4. (మామేకం శరణం వ్రజ) యను వాక్యముచేత సిద్ధోపాయ స్వీకారమాత్రమును జెప్పక (సర్వధర్మాన్ పరిత్యజ్య) యను వాక్యముచేత సర్వధర్మ పరిత్యాగమున్ను కూడా చెప్పుటకు హేతువేమంటే సిద్ధోపాయమునకును ఈ సాధనాంతర పరిత్యాగమును నంగములేనప్పుడు స్వరూపసిద్ధి లేకపోవుట చేత సాంగముగా జెప్పుచున్నది. (ప్రక్షాళ్య పాదావాచామేత్ స్నాత్వావిధి వదర్చయేత్ స్థిత్వాఘ్యాః భానవే దద్యాత్ ధ్యాత్వాదేవం జపేన్మనుం) ఇత్యాదులయందు జెప్పబడిన ఆచమనాదులను వాటికంగములైన పాదప్రక్షాళనాదులు వినాగా చేయకూడదనట్లు ఈ శ్లోకమందున్ను (పరిత్యజ్య) యను (ల్యబంత) పదముచేత జెప్పబడుచున్న సాధనాంతర పరిత్యాగము వినాగా సిద్ధోపాయ స్వీకారమున్ను చేయకూడదనే యర్థము సిద్ధము. కొందరీశ్లోకమునందు జెప్పబడుచున్న సాధనాంతర పరిత్యాగమును విధిగా నొప్పక, అజ్ఞానముచేతనున్ను అశక్తిచేతనున్ను చేయ లేకపోతిరేని యని అనువాదముగా నంగీకరించి, యట్టి యజ్ఞానులు అశక్తులు మొదలగువారల కీసిద్ధోపాయము విధింపబడుచున్నదని చెప్పుదురు. ఈ యాక్షేపము కేవల మయుక్తము. ప్రక్షాళ్యేత్యాది శ్రుతిప్రమాణమునకర్థము (పాదే=పాదములను, ప్రక్షాళ్య=శోధనము జేసుకొని, ఆచామేత్=ఆచమనము జేయవలయును. స్నాత్వా=స్నానముచేసి, విధివత్=శాస్త్ర ప్రకారముగ, అర్చయేత్=

అర్పించవలెను. స్థిత్వా=నిలువబడి. భానవే=సూర్యునికొఱకు అర్ఘ్యం=అర్ఘ్యప్రదానమును; దద్యాత్ = ఇయ్యవలెను దేవం=దైవమును, ధ్యాత్వా=ధ్యానముచేసి, మనుం=మంత్రమును, జపేత్=జపించవలయును.

5. ఈ యుపాయ మితరోపాయములవలెనే కష్టసాధ్యముగాక సులభమై యుండుటచేత చేతనునికి రాగప్రాప్తమై యునగా యిష్టమైయుండగా వేరే విధించుటకు కారణమేమన్నను (ఒకరోగి భోగ్యమైనపాలు త్రాగవలెనని వాంఛగలిగియున్నప్పుడా పాలనే మందుగా విధించిన పక్షమందు వాడు శీఘ్రముగా త్రాగుటకు హేతువైనట్లితరోపాయములకన్న నీ యుపాయము విలక్షణ మగుటచేత దీనినే పరిగ్రహింతమని వాంఛించిన చేతనుని కీయుపాయమునే పరిగ్రహింపుమని విధించిన యెడల శీఘ్రముగా పరిగ్రహించుట కుపయుక్తంబై యుండును

6. ఈ చరమశ్లోకమందలి పూర్వార్థము (సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ) యని ఆఱుపదములు గలదై యుండును.

7. సర్వధర్మాన్ అనునది ప్రథమ పదము.

8. సమస్తధర్మములని దీనికర్థము.

9. ఈ పదమందు ధర్మశబ్దమున్ను బహువచనమున్ను సర్వశబ్దమున్ను యున్నవి.

10. ఇందు ధర్మశబ్ద మైహికాముష్మిక ఫలసాధనము

లను చెప్పక భగవత్ప్రాప్తి రూపమైన మోక్ష ఫలమునకు సాధనమైనవాటిని జెప్పెను.

11. ఈ మోక్షఫలసాధనము లనునవి శ్రుతి స్మృతుల యందు విధింపబడి అనేకములై యుండుటచేత ధర్మాన్ అని బహువచన ప్రయోగము జేయబడుచున్నది

12. ధర్మము లేవనగా కర్మజ్ఞాన భక్తియోగములును, అవతార రహస్యజ్ఞానమున్ను, పురుషోత్తమ విద్యయున్ను, దివ్యదేశ వాసమున్ను, భగవన్నామ కీర్తనమున్ను, భగవత్సన్నిధిని చేయు దీపారోపణమున్ను, పుష్పకైంకర్యము మొదలగు నుపాయబుద్ధితో జేయునవియున్ను, అవతార రహస్యజ్ఞానమనగా నీశ్వరునియొక్క రామకృష్ణా ద్యవతారములున్ను అవతార చేష్టలున్ను కేవల మీశ్వరేచ్ఛ చేతనే జేయబడినవి యనియును కర్మవల్లవచ్చినవిగావనియును, శాపాదికము వ్యాజమాత్రమనియును, యివి దివ్యములనియును దెలుసికొనుట. పురుషోత్తమ విద్యయనగా లోకమందు క్షరాక్షర శబ్దముల చేత జెప్పబడు పురుషులిద్దరు. వారిలో క్షరశబ్దవాచ్యులు బద్ధాత్మలు, నిత్యముక్తు లక్షర శబ్దవాచ్యులు. ఈ యుభయులకన్నను విలక్షణుడైన ఈశ్వరుడు పురుషోత్తమ శబ్దవాచ్యుడని తెలుసుకొనుట.

13. సర్వశబ్దముచే మోక్షఫల సాధనములగు కర్మయోగా ద్యుపాయముల నాచరించుటకు యోగ్యతను గలుగ

జేయు సంధ్యావందన పంచమహాయజ్ఞాదిరూపమైన నిత్యనైమిత్తికాది కర్మలు చెప్పబడును. పంచమహా యజ్ఞములనగా దేవయజ్ఞ పితృయజ్ఞ భూతయజ్ఞ మనుష్యయజ్ఞ బ్రహ్మయజ్ఞములు.

14. సర్వధర్మాన్ అను పదమునకు శ్రుతి స్మృతుల యందు విధింపబడినవై నిత్యనైమిత్తికాది రూపములైన కర్మయోగాద్యుపాయములని యర్థము.

15. ఈకర్మజ్ఞానాదులనెడు స్వతంత్రోపాయములను భగవదత్యంత పరతంత్రమైన యాత్మస్వరూపమునకు విరోధులగుటచేతను వీటినిఅధర్మాన్ అనిఅధర్మశబ్దముచేత చెప్పవలసి యుండగా ధర్మశబ్దముచేత జెప్పుటకు హేతువేమనగా అర్జునుడు స్వధర్మమైనయుద్ధమును అధర్మముగానున్ను అధర్మములైన వీటిని ధర్మములుగానున్ను భ్రమించియుండుట చేత.

16. [పరిత్యజ్య] అను నవ్యయ పదమునకు విడిచిపెట్టుమని యర్థము.

17. ఈ [పరిత్యజ్య] యను పదమునకు త్యాగశబ్దమును ల్యప్ ప్రత్యయమును (పరి) అనునుపసర్గమున్ను గలవు. త్యాగశబ్దార్థము ముందుజెప్పబడును. ఇచటజెప్పబడిన త్యాగమనునది కేవలము విడుచుట మాత్రముగాదు. ముత్యపుచిప్పను జూచివెండియని భ్రమజెందినవానివలె తనకు ప్రయోజనమున్నట్టి యొకదిక్కునకు వెళ్ళవలెననియుద్దేశించియా

దిక్కేయను భ్రమతో మరియొక దిక్కునకు వెళ్ళినవాని వలెనున్న ఈశ్వరప్రాప్తి సాధనములను కోరుచున్న మన మాసాధనములుగాని వాటియందు సాధనబుద్ధి చేసితిమే యను జ్ఞానముతో విడచి పెట్టుట.

18. (పరి) యను నుపసర్గార్థము జెప్పబడును. పరి యను నుపసర్గముచేతను బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయము, గుర్వంగనా గమనము మొదలగు మహాపాతకముల నజ్ఞానముచేత చేసిన తరువాత లజ్జపడి పశ్చాత్తాపము నొంది విడుచుకొనినపు డెన్నడును వాటిలో బుద్ధిపూర్వకముగాగాని యబుద్ధి పూర్వకముగాగాని ప్రవర్తించకుండా రుచి వాసనలతో కూడా వదలుకొన్నట్లు పాతకశబ్దముచేత జెప్పబడుచున్న యుపాయాంతరములను పునరన్వయము లేకుండా రుచి వాసనలతో కూడా విడువవలయునని యర్థము జెప్పబడుచున్నది.

19. (ల్యప్) ప్రత్యయార్థము జెప్పబడును. ఈ ప్రత్యయముచేత (స్నాత్వాభుంజీత) యను విధి మూడు స్నానము చేసియే భుజింపవలయునను నియమము చెప్పినట్లు, సిద్ధోపాయ స్వీకార సమయమందున్ను విడువవలసిన కర్మజ్ఞానాది రూపములైన యుపాయాంతరములను విడిచియే స్వీకరింపవలయునను నియమము చెప్పబడుచున్నది.

20. అతిబలశాలియైన రావణుడు రామబాణముచేత ధనుస్సు ఖండించబడి శిథిలమైన శరీరముగలవాడై మనఃకాలుష్యము నొంది యుద్ధమును చేయజాలక పారిపోవలెనని ప్రయత్నించుచున్నపుడు స్వామి పోనీయక బాణముల బ్రయోగించుచుండెను. యుద్ధము చేయు స్వామి మరలను బోనీయక పోవడమునకు హేతువేమని యూహించి తనచేతిలోనున్న ధనుఃఖండమే కారణమని నిశ్చయించి భయపడి దానిని విడిచిపెట్టెను. ఆధనస్సు రావణునకు యుద్ధమునకుసాధనముకాకపోవుటయే కదా పారిపోవుటకుకూడా ప్రతిబంధకమైనట్లు, ఈయుపాయములును సాధనములు గాకపోవుటయే గాక ఫలమునకు ప్రతిబంధకమగును.

21. పూర్వము దశరథ చక్రవర్తి కైకేయికి వరమిచ్చిన తరువాత నతిక్రమింపజాలక ఆభాసమానమగు సత్యధర్మమవలంబించి సాక్షాద్ధర్మమైన స్వామితో గూడియుండుటయను ఫలమునకు చెడినట్లు. ఆభాసధర్మములైన యుపాయాంతరముల నవలంబించుట సాక్షాద్ధర్మమైన యీశ్వరునితో గూడి సుఖించియుండుటయనెడు ఫలముజెడుటకు హేతువగును.

22. (సర్వధర్మాన్పరిత్యజ్య)యను పదమందు విడువ వలెనని చెప్పబడుచున్న ధర్మములు విధి నిషేధరూపముగా రెండువిధములై యుండును. విధింపబడిన ధర్మములనగా'ఇదంకురు' అని చెప్పబడిన సంధ్యావందనము మొదలు మోక్షసాధన

కర్మజ్ఞాన భక్తి పర్యంతమైన ధర్మములు. నిషిద్ధ ధర్మములనగా (ఇదం మాకార్షీః) అని యిట్లు నిషేధింపబడిన కార్యములు. అనగా పరదారగమనము, పరద్రవ్యాపహారము, సురాపానము, అసత్యకథనము, అభక్ష్య భక్షణము మొదలగు పనులను విడుచుటయును. సర్వధర్మాన్పరిత్యజ్య యనుపదము చేత నీయుభయ విధమైన ధర్మములను విడువుమని చెప్పబడుట చేత నధర్మములఁ జేయవలసివచ్చునని కొందరాక్షేపించుచున్నారు. అది యెట్లంటె విహిత రూపధర్మములను విడుచుటయనఁగా: నిషిద్ధ రూప ధర్మముల నవలంబించుటయే యని యందురు.

23. సర్వధర్మములను విడువుమని చెప్పిన మాత్రము చేత అధర్మములను జేయవలసి వచ్చునను యాక్షేపణమునకవకాశము లేదు. అధర్మములను జేయుమని చెప్పియుండలేదు.

24. అయిన నధర్మ నివృత్తియును ధర్మమే గనుక దానిని విడువుమని చెప్పుటయే చాలును. అధర్మముల జేయుమని వేరే చెప్పనక్కఱ లేదు. అందువల్లనే అధర్మముల జేయుమని చెప్పబడుచున్నదంటె.

25. అటుల జెప్పబడదు. ధర్మశబ్దము అధర్మ నివృత్త్యాద్యంగముగాగల ప్రధానమైన విహితధర్మమును జెప్పును గాని, అధర్మనివృత్తి మాత్రమును జెప్పజాలదు గనుక అధర్మమును జేయవలసివచ్చుననే యాక్షేపణమునకవకాశము లేదు.

26. సర్వశక్తిబలముచేతను పరిధానమైన విహితధర్మములకు విశేషములైన నిషిద్ధధర్మములు చెప్పబడినప్పటికిన్ని యాస్థలముం దవి వివక్షితములుగాక పోవుటచేత నా నిషిద్ధ ధర్మములను చెప్పక విహితరూప ధర్మములనే చెప్పెను.

27. ఈశ్వరునకు ప్రీతిజేయుటయే స్వరూపముగా గల చేతన స్వరూపమునుజూచినను, యుపాయాంతర సహాయమును గూడ సహింపని సిద్ధోపాయ భూతుడైన ఈశ్వర స్వరూపమును జూచినను, యీశ్వరప్రీతిరూపమైన ఫలస్వరూపమును జూచినను యీశ్వర నిగ్రహమునకు హేతువగు యధర్మములను జేయుటకు కారణ మగపడదు.

28. మామ్ అను పదమునకు నన్ను నని యర్థము,

29. సర్వరక్షకుడనై, సౌశీల్యముచేత నీయొక్క ఆజ్ఞను వర్తినై నిన్ను రక్షింపకుండనే యాశచేత నీయొక్క యనుమతికై నిరీక్షించి దోషభోగ్యుడనగుటచేత నీదోషములను భోగ్యముగా బరిగ్రహించి నీకుగతియై శీతల స్వభావము గల పురుషకారభూతురాలగు పిరాట్టియారు దోషములను జెప్పి విడిపింపజూచినను, నిన్ను విడువజాలక రక్షించుటయే స్వభావముగాగల నన్ను.

30. (మామ్) అను పదముచేత "యవతరించి కంటికి కనుబడుచుండి దగ్గరనున్న తననగా కృష్ణుని యుపాయముగా చేసుకొమ్మనిన దీనివల్ల దూరముగానుండు పరవ్యూహముల

నున్ను యింద్రాది శరీరుడైన యంతర్యామినిన్ని కాధని యర్థము జెప్పుచున్నది.

31. స్వప్రాప్తియనగా భగవత్ప్రాప్తికి సాధనమైన ధర్మసంస్థాపనార్థమై కృష్ణరూపముగా నవతరించిన తానే మోక్షసాధనముగా శాస్త్రమందు జెప్పబడుచున్న సర్వధర్మములను విడచి తననాశ్రయింపుమని చెప్పుటచేత నవియాభాస ధర్మములు గాని సాక్షాద్ధర్మములు గావనియును స్థాపింపదగిన సాక్షాద్ధర్మము దానే యనియు జెప్పబడెను.

32. కర్మజ్ఞానాది సాధనములకంటె దీనికతిశయమేదనగా చేతనుడుచేయు వ్యాపారములచే స్వరూపసిద్ధిగల్గియుండే కర్మజ్ఞానాదులవలెగాక స్వతస్సిద్ధమై, వాటివలె నచేతనమై యుండక పరమచేతనమై. అశక్తిగలదిగాక, సర్వశక్తియై, ఉపాయములుగలదిగాక నిరపాయమై, పరతంత్రమైన ఆత్మస్వరూపమున కప్రాప్తమైయుండక, ప్రాప్తమైయనగా స్వరూపానురూపమై మరియొక సహాయమున పేక్షింపనిదై యుండును.

34 ఉపాయాంతరములు చేతనునిచే సాధింపబడునవి యగుటచేత తమయొక్క స్వరూపసిద్ధియందు చేతనసాపేక్షములై యుండును, చేతనునికిఫలమునిచ్చుసమయమందున్నూ దనకు జ్ఞానశక్తులులేక యచేతనములై యశక్తములై యుండుటచేత యీశ్వర సాపేక్షములై యుండును. సిద్ధోపాయమున్ను

గాక సిద్ధమును పరమును ఏకమును సర్వశక్తియు నగుటచేత ఉపాయాంతరములను ప్రతిభటమై అన్యనిరపేక్షమై యుండును.

35. (మామ్) అను పదముం దర్జునునియొక్క దోషముల నాలోచింపక తత్త్వవివేకము మొదలు కానలసిన యర్థముల నుపదేశించుటచేతను వాత్సల్యగుణమున్ను, తనయొక్క పరత్వమును విశ్వరూప సందర్శనము మొదలైనవాటిచేతను సాక్షాత్కరింప చేయుటవల్ల స్వామిత్వమున్ను, హే కృష్ణా! హేయాదవా! హే సఖే! యని అర్జునుడనను మిత్రునిగా తలంచి పిలుచునల్లుతనితో కలిసి మెలసియుండుటచేత సౌశీల్యమున్ను, కంటితో చూడశక్యముగాని అప్రాకృత దివ్యమంగళ విగ్రహమును నేత్రములతో జూడదగినట్లుగా జేయుటచేతను సౌలభ్యమున్ను స్ఫుటముగా ప్రకాశించుచున్నవి.

36. గుఱ్ఱములను తోలుటకాస్థలమందు ధరించిన వేత్రమునగా కొరడాయున్ను ఎటువైపునలసిన నటువైపు త్రిప్పుటకును నిలువవలసిన స్థలమందు నిల్పుటకు పట్టుకొన్న లగామును తలయందు కిరీటము మొదలైన ఆచ్ఛాదనము లేకపోవుటచేత సేనాధూళిచేత కప్పబడిన శిరోజములును రథమునకు క్రిందుగా వ్రేలాడవేసిన శ్రీపాదములును గలవాడై నిలిచియున్న సారథ్యవేషమును(మామ్) అని కనుపరచుచున్నాడు.

37. (ఏకం) అను పదమున కర్థమును సాయించుచున్నారు.

38. ఏకశబ్దము స్థానప్రమాణముచేతను (ఏవ) కారార్థమును జెప్పును. స్థానప్రమాణమనగా నేకస్థానమందేవకారము ప్రయోగింపబడియుండుట అనగా ప్రపత్తిని జెప్పుస్థలమందే(ఏవ) కారముండుటచేతను ఆ (ఏవ) కారస్థానమందిచ్చుట ఏక శబ్దముండుటచేతనున్ను ఈ యేకశబ్దమునకు ఏవకారార్థమే జెప్పబడును.

39. "మామేవయేప్రపద్యంతే" నన్నేనరుప్రపత్తి చేయుచున్నారో "తమేవచాద్యం పురుషంప్రపద్యే" కారణుడైన యీపురుషునే ప్రపత్తిచేయుచున్నాను "త్వమేవోపాయభూతోమేభవ" నీవే నాకుపాయ భూతుడవ్వుగమ్ము "అతస్తవక్కాస్మి పాదమేశరణాక త్తస్మాస్మిన్నాంస్" నీ ప్రాప్తికుపాయము నుపదేశించు సమయమందు నీపాదములనే యుపాయముగా నుపదేశించినావు ఇత్యాదులయందువలెనె (మామేకం) అనే యీస్థలమందు (నన్నే) అని ఏవకారార్థమునే చెప్పవలయును.

40. ఏవకారార్థమును జెప్పు నీయేకశబ్దముచేతను 'వ్రజ) యను పదమందు జెప్పబడుచున్న విశ్వాసరూపమైన సిద్ధోపాయ స్వీకారమందలి యుపాయత్వము దీసివేయబడుచున్నదనగా నీవే నా కుపాయము కావలెనని భగవత్సన్నిధియందు చేతనుడు చేయు నుపాయస్వీకారము (వాడిచ్చుఫలమున కుపాయముగాదు, ఈశ్వరుడే యుపాయమని వీడుసేయు స్వీకారమందలి యుపాయత్వమును దీసివేయుచున్నది.

41. సిద్ధోపాయానంతరమందే ఫలము సిద్ధించుటచేత నున్ను స్వీకారము లేనప్పుడు ఫలము సిద్ధించక పోవుటచేత నున్ను ఈ స్వీకారము ఫలసిద్ధి కవశ్య ముండవలసియుండ గా నిట్టి స్వీకారమం దుపాయత్వమెటుల దీసివేయ బడునంటె ఈ స్వీకారానంతరమందు చేతనునికి గలుగబోవు ఫలము యుపాయ భూతుడైన యీశ్వరునిచేత సిద్ధించునట్లు యీ స్వీకారమున్ను వాని చేతనే సిద్ధించును. ఇందువల్ల ఈ స్వీకార ముపాయభూతుడైన ఈశ్వరుని వల్ల బుట్టినదిగాని సాక్షాదు పాయము గాదు.

42. ఈ సిద్ధోపాయభూతుడైన ఈశ్వరుని వలన నీ యుపాయ స్వీకారము బుట్టుటనగా చేతనులు కరణకళేబర ములు లేనందువలన భోగ మోక్షములను జెడియ చిత్ప్రాయులై పడియున్న దశయందు కరణకళేబరములిచ్చి జ్ఞానవికాసమును గలుగజేసి తాననేకావతారములెత్తి ఆశ్రియణరుచి విశ్వాస ములను బుట్టింపదగిన తన కల్యాణగుణ చేష్టితములను బ్రికా శింప జేసి ఈ విధముగా వాడు జేసిన కృషిచే ఫలించినందున ననుట.

43. జ్ఞానాధికులైన నిత్యసూరులకు నిర్వాహకుడైన సర్వేశ్వరుని కటాక్షము బ్రసరించి దానివలన వానిని పొందు టకై వానిని జ్ఞానమందుంచుకొన్నాననగా వానినే ఫలసాధ న మొనర్చుకొన్నానని నమ్మాళ్వారులు భగవల్లాభమున

సిద్ధోపాయము స్వీకరించేనానని సాయించుచు నా సిద్ధోపాయ స్వీకారమును వాని నిర్హేతుక కృపచేతనే నాకు గల్గినదని సాయించినందు వలననీ స్వీకార మీశ్వరునియొక్క కృపిఫల మనియే గ్రహింపవలయును.

44. చేతనులకు సిద్ధోపాయ స్వీకారమునందు రుచి పుట్టుటకుం గృషి చేయువాఁడున్ను ఈశ్వరుఁడే. అందువలన నీ చేతనులు సిద్ధోపాయ స్వీకారముచేసిన మాత్రముచేత ఫల మిచ్చుననియు అది లేకపోయినప్పుడియ్యడనియును దలంపక నాత్మోజ్జీవనమునకే సర్వదా యత్నించు సర్వేశ్వరుండు మనయొక్క యిష్టప్రాప్త్యనిష్టనివారణ రూపమైన ఫలమును గలుగజేయువాఁడని ప్రతిపత్తి గల్గియుండవలయును.

45. సిద్ధోపాయ స్వీకారము చేయక పోయినను చేతనులయొక్క కార్యముల నీశ్వరుఁడు చేయునని తలంపక సిద్ధోపాయస్వీకారమవశ్యముగా కార్యసిద్ధికి యుండవలెనని తలచిన యెడల నుపాయభూతుఁడైన ఈశ్వరునియొక్క సహాయాంతరనైరపేక్ష్యమునకు భంగమువచ్చును.

46. ఈశ్వరుఁడు సర్వసముఁడగుటవలన చేతన కృత్యమును లేశము నపేక్షింపకయే ముక్తియిచ్చునప్పుడందరికి నొక్క పర్యాయమియ్యక కొందరికే యివ్వడమునకు హేతువేమను ప్రశ్నమునకు బరిహారార్థ మింతకాలము మనలను రక్షింపని ఈశ్వరుఁడు నేఁడు రక్షించునా యను సంశయము గల్గ

లప్పుడు తన్నివృత్తికొఱకు ఈ సిద్ధోపాయ స్వీకారము వ్యాజ్యమైయుండును. ఆత్మ అచేతనముగాక చైతన్యముగలవాఁడైయుండుటచేతనున్ను భగవదేకోపాయత్వ రూపమైన ఈ యధ్యవసాయము చైతన్యకార్య మయ్యేయుండునుగాని యుపాయము కాదు. ఈ సిద్ధోపాయము విధింపబడివచ్చినది కాదు. చేతనుని యొక్కరుచినిబట్టి వచ్చినది భగవదేక రక్షకత్వ రూపమైన స్వరూపమునకు విరుద్ధముగాదు. అనుగుణము. అనాదికాలము నుండి స్వయత్నముచేత నీశ్వరుడు చేయురక్షణము నంగీకరింపనిచేతను డంగీకరించినందుకు సూచకమునైయుండును.

47. (మామ్) అనుపదమనకు బూర్వమందున్న (సర్వ ధర్మాన్పరిత్యజ్య) అను స్థలమందు సర్వ ధర్మ పరిత్యాగము ను జెప్పిన సర్వేశ్వరుడు దా నుపాయాంతరములు నుపాయము గాదలపక నొక తననే యుపాయముగా దలంపుమని చెప్పెను. (ఏకం) అను స్థలమునకు స్వీకారమందుపాయముగా దలంపక నొక్క తననె యుపాయముగా దలంపుమని చెప్పుచున్నాడు.

48. నిరుపాధిక రక్షకుడైన ఈశ్వరుని రక్ష్యభూతుడైన చేతనుడు దన రక్షణమునకుపయుక్తముగా నాశ్రయించిన యాశ్రయణమనగా స్వీకరించు స్వీకార మహంకార గర్భము. కుమారుడు దన్నుపోషించుటకై తండ్రిచేత గ్రాయించుకొన్నట్లుగా నవద్యకర మనగా నింద్యమున్ను.

49. చేతనులను రక్షించుటకు సమర్థుడైన యీశ్వరు డభిమానించి పరిగ్రహించుటయను స్వీకారమే ఈ చేతనులకు రక్షకము.

50. సిద్ధోపాయముకన్న యితరములైన యుపాయాంతరములైనను ఉపాయాంతరములయొక్క స్వరూపము చేతన ప్రవృత్తిరూపమైన వ్యాపారముచేత సిద్ధింపవలసి యుండుటచేతను వాటి కీచేతనునియొక్క స్వయత్న నివృత్తి దోషమై యుండును. ఈ సిద్ధోపాయము సహాయాంతరము నపేక్షింపక పోవుటచేతను దీనికి చేతనునియొక్క ప్రవృత్తిరూపమైన వ్యాపారము దోషమైయుండును.

51. సమ్యాశ్వార్లు సిద్ధోపాయ స్వీకార ముపదేశించు సమయమందు విశేషించి వ్యాపింప నక్కరలేదు చింతించుట చాలునని యుపదేశించినందువల్ల ఈ సిద్ధోపాయ స్వీకార మొనర్చు వారల కే వ్యాపారమును జేయనక్కరలేదు.

52. క్రిందననగా సర్వధర్మాన్పరిత్యజ్య అను స్థలమందు చేతనులయొక్క సకల ప్రవృత్తి నివృత్తియును జెప్ప బడెను.

53. నాయొక్క దుష్టమనస్సును బోగొట్టినావు. నిన్నాదరించి సేవించుటకు మనస్సిచ్చినావని ఉపాయభూతుడైన ఈశ్వరుని విషయమై చేతనునికిగలుగుటయును ఉపకారస్మృతి యనుచైతన్యమునుబట్టి వచ్చినదిగనుగ నుపాయములో జేరదు,

54. (శరణం) అను పదమునకు.

55. ఉపాయముగాని యర్థము.

56. ఈ శరణ శబ్దము రక్షించువానిని గృహమును నుపాయమును తెలుపునదియైనను ఈ స్థలమందనగా నుపాయాంతరములను విడనాడి యీశ్వరునే యుపాయముగా వరించు స్థలమందు ఉపాయమునే కనబరచును. ఎందుచేత నంటే సర్వోపాయములను విడిచి తననే పట్టుమని చెప్పుచున్న స్థలముగుటచేత ఉపాయమును జెప్పిననే (సర్వధర్మాన్పరిత్యజ్య) యను క్రింది వాక్యముతో జేరును. ఆలాగు జేరని పక్షమునకుం బ్రకరణ భంగమను దోషమువచ్చును. ప్రకరణ భంగమనగా నొక హంశము నుపపాదించుచు దానికి విరుద్ధమైన హంశమునుగాని దానితో సంబంధింపని హంశమునుగాని చెప్పుట. ఈ శ్లోకమందు జెప్పబడిన సర్వధర్మ పరిత్యాగమే ఈశ్వరునియొక్క ఉపాయత్వమును గనబరచుచుండగా శరణశబ్ద ప్రయోగమున కవసరము లేదని కొందరందురు. ఉపాయాంతరత్యాగము జెప్పబడినది సిద్ధోపాయ స్వీకార సమయమందువలెనే ప్రాప్య సమయమందును సమానమై యున్నది. ఎందుచేతననగా ప్రాప్యసిద్ధ్యనంతరమం దేటు దాటిన వెనుక నావతో బ్రయోజనము లేనట్లు, ఉపాయాంతరములతో బ్రయోజనము లేదు. కాబట్టి ఉపాయాంతర త్యాగ

ముతో గూడియున్నను (వ్రజ) యను పదములో జెప్పిన స్వీ కారమాత్రము ప్రాప్య సమయమందలి స్వీకారమును దీసివేసి సిద్ధోపాయ స్వీకారమును స్థాపింపజాలను. సిద్ధోపాయః స్వీకా రమున కంగముగా విధింపబడిన ఈ యుపాయాంతర త్యాగ మంగిన్నైన సిద్ధోపాయ స్వీకారము నర్థముగా గనబరచినను. దానికన్న శాబ్దముగాఁ జెప్పుటచే బలము గలుటవలన నవశ్యముగ శరణ శబ్దప్రయోగముండవలయును.

57. వ్రజ యను పదమునకు.

58. బుద్ధిజేయుమని యర్థము.

59. వ్రజగతౌ యను ధాతువు గతిని జెప్పును. "గత్య ర్థాః బుద్ధ్యర్థాః" అను న్యాయముచేతను గత్యర్థమును జెప్పు (వ్రజ) ధాతువు బుద్ధ్యర్థమును జెప్పును. దీనివల్ల (వ్రజ) యను ధాతువున కధ్యవసింపుమని యర్థము. అధ్యవసాయమనునది త్యాజ్యములైన ఉపాయాంతరములలోనుండి దాటినదై వాటి కంటె విలక్షణమైనదై ఆ యుపాయాంతర త్యాగమే అంగము గాగలదై భగవద్రక్షకత్వాను మతి రూపమైనదై చైతన్య కార్యమై ప్రార్థనారూప మైనదై భగవన్ముఖోల్లాసమునకు హేతువై స్వరూపానుగుణమై ఫలము నాలశ్యము జేయక తప్పకుండా యిచ్చునదై యుండు జ్ఞానవిశేషము.

60. ఆళ్వార్లు కరణత్రయముచేత బ్రపత్తిజేసినట్లు కను బడుచున్నది కాబట్టి అధికార పూర్తికి కరణత్రయమపేక్షితమై

నను ఫలసిద్ధికి జ్ఞానాన్మోక్షంబని భారతమందు జెప్పుటచేత మానసికా ధ్యవసాయమాత్రము చాలును.

61. సర్వధర్మాన్ అనుపదముచేత విడువవలసిన యుపాయమును జెప్పి పరిత్యజ్య అను పదముచేత విడుచు ప్రకారమును జెప్పి (మామ్) అను పదముచేత నాశ్రయింపబడు నుపాయభూతుని జెప్పి [ఏకం] అను పదముచేత నుపాయత్వమును జెప్పి వ్రజ యను పదముచేత నుపాయస్వీకారమును జెప్పి ముగించుచున్నారు.

62. ఈ శ్లోకముయొక్క ఉత్తరార్థమునకర్థము జెప్పుటకై ముందుగా (అహం=నేను) పద మెత్తుచున్నారు.

63. ఈ యుత్తరార్థముచే నీశ్వరు డుపాయభూతుడైన తాను జేయు కృత్యమును జెప్పుచున్నారు.

64. అహం అను శబ్దమునకు సర్వజ్ఞుడై సర్వశక్తిగలవాడై రక్షించుటకు దగిన శేషత్వరూప సంబంధముగల నేనని యర్థము.

65. ఈ (అహం) అను పదము చేతనుని కీశ్వరుడిష్టప్రాప్తి అనిష్ట నివారణములను జేయునపుడు వీని బూర్వోత్తరస్థితులను దెలుసుకొనుటకు నటుపిమ్మట వీనికార్యము జేయుటకు నావశ్యకమైన సర్వజ్ఞత్వ సర్వ శక్తిత్వములనున్న చేతనునికి చేయుకార్యములు స్వకార్యములు గాదలచి నెరవే

ద్భుటకుపయుక్తమైన శేషిత్వ రూపసంబంధమున నవాప్త సమస్తకామత్వమును పూర్తినిన్ని ప్రకాశింప చేయుచున్నది.

66. [మామ్] అను పదమునందు నీకు సారథినై నిలిచియున్న నన్నుపాయముగా నాశ్రయింపుమని స్వామి సాయించినప్పుడు అర్జునుడు దనరక్షణార్థమై స్వామిధరించిన సారథ్యవేషమునుజూచి సర్వస్వామియైన వాడిట్టి నీచకృత్యమందు నిలిచినది ఆయన సౌశీల్యముచేతనని తెలియక మనకు నీచకృత్యమును చేయువాడు మనలను రక్షింపగల్గువాడాయని తనను బట్టి చూచి భయపడగా నట్టి భయము దీరునట్లుల నిరంకుశస్వాతంత్ర్యరూపమైన పరత్వమును (అహం) అను పదముచేత ప్రకాశింపజేయుచున్నాడు.

67. ఇట్టి పరమస్వతంత్రుడగు నీశ్వరుడు అర్జునునికి సారథియైనిలచిన యీ పారతంత్ర్యమున్ను తనయొక్క నిరంకుశస్వాతంత్ర్యకార్యమే.

68. [త్వా] యను పదమునకు.

69. ఈ కార్యమును దెలుసుకొనుటకు దగిన జ్ఞానము లేనివాడవై తెలిసినను నెరవేర్చుకొనుటకుదగిన శక్తిలేనివాడవై శక్తిగలిగియుండినను నీయొక్క రక్షణమందు నీకు ప్రాప్తిలేనివాడవై అనగా సంబంధములేనివాడవై యుండుటచేతను స్వతంత్రోపాయములైన సర్వధర్మములను విడిచి నన్నే నిరపేక్ష సాధనముగాబట్టియున్న నిన్నని యర్థము.

70. సర్వపాపేభ్యః అను పదమునకు నాప్రాప్తికి ప్రతి బంధకములనగా మోక్ష ప్రతిబంధకములని ఏయే పాతకములనుగూర్చి భయపడుచున్నావో, ఆయా పాతకములన్నింటినలననని యర్థము.

71. ఈ స్థలమునందు భగవత్ప్రాప్తి విరోధులను మాత్రము చెప్పుటచే జ్ఞానవిరోధులను రుచివిరోధుల నుపాయ విరోధుల నన్నింటిని పూర్వాధ్యాయములయందె తీసి వేసినట్లు స్పష్టమగుచున్నది. పాపశబ్దము యొక్క బహువచనార్థము చెప్పబడుచున్నది.

72 దేహాత్మాభిమానము నెడు అసత్యజ్ఞానమున్ను సాంసారికవృత్తిరూపమైన దుష్టవ్యాపారమును, రక్తమాంసాది మయమైనమలినదేహమున్ను అని నమ్మాళ్వార్లుతిరువిరుత్తమను ప్రబంధముయొక్క మొదటిపాశురమున సాయించిన ప్రకారముగా నవిద్యయు గర్మము వాసనయు రుచియు ప్రకృతిసంబంధమును జెప్పబడుచున్నవి. అవిద్యయనునది అజ్ఞాన అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానములని మూడువిధములుగా నుండును. (1) అజ్ఞానమనగా జ్ఞానశూన్యమనగా, దేహముకంటె వేరె ఆత్మయున్నాడని తెలియకపోవుట (2) అన్యథా జ్ఞానమనగా ధర్మమందు ధర్మాంతరప్రతిపత్తి. ఉదాహరణము (పీతశ్శంఖః)శంఖము పచ్చనిదని శంఖస్వాభావిక శుక్లగుణమును గ్రహించక పచ్చనిదిగాగ్రహించుట.విపరీతజ్ఞానమనగా ధర్మియందుధర్మాం

తరప్రతిపత్తి (ఉ) (ఇదంరజితం) అని శుక్తిని రజితముగా గ్రహించుటయు రజితమును తగరముగా గ్రహించుటయు (2) ధర్మమనునది పుణ్యము పాపమని రెండు విధములు. అందు బుణ్యమున్ను పాపమువలెనె మోక్షప్రతిబంధకమగుటచేత పాపశబ్దములో నంతర్భూతమగు గాబట్టి (సర్వపాపేభ్యః) అని పుణ్యపాపములున్ను పాపశబ్దముచేత చెప్పబడుచున్నవి (3) వాసనయనగా నబుద్ధిపూర్వక వ్యాపారమునకు హేతువువై యుండునది. అదియును అజ్ఞానవాసన కర్మవాసన ప్రకృతిసంబంధవాసన యని మూడు విధములుగా నుండును (4) రుచియనగా బుద్ధిపూర్వక వ్యాపారమునకు హేతువైయుండునది. అదియును విషయభేదముచేత బహువిధమైయుండును (5) ప్రకృతిసంబంధమనగా స్థూలసూక్ష్మరూపమైన దేహసంబంధము. ఆయాలోకములందే మనుష్యాదిరూపములుగా నుండి చేయు సుఖదుఃఖాద్యనుభవమునకు సాధనమైయుండునది స్థూలదేహము. దేహత్యాగానంతరమందాయా లోకములనుండి లోకాంతరమునకు వెళ్ళుటకు సాధనమైయుండు శరీరము సూక్ష్మశరీరము.

73. తృణచ్ఛేద కండూయనాదులవలెనెఅబుద్ధిపూర్వకముగా ప్రకృతిసంబంధ వాసనచేత చేయు నుత్తరాఘములనగా ప్రపత్త్యనంతరమునప్రామాదికముగా చేయుపుణ్యపాపములను లోకులు నిందింతురను భయముచేతనున్ను వారలు చెడిపోదురనెడి కృపచేతనున్ను చేయునిత్య నైమిత్తికాది కర్మలును

మోక్షసాధనములుగావనియు,నిదివరలో విడిచిన కర్మజ్ఞానాదులను మనః కాలుష్యము చేతను తిరుగనుపాయముగా బరిగ్రహించుటగాని పునః ప్రవృత్తిచేయుటగాని యీ మొదలగు సమస్తమును సర్వశబ్దముచేతజెప్పబడును.

74. చిత్రవిభ్రమముగల వారొక గ్రామమునకు వెళ్లనిచ్ఛలేకపోయిన నొక మార్గము వెంబడి పోయినమాత్రముచేత నొక గ్రామమునకు జేరునట్లు, సాధనబుద్ధిచేయక కేవలలోకాపవాదము మొదలగు వాటిచేత జేయబడుచున్న నిత్యనైమిత్తికాది కర్మములు నుపాయములలో జేరకమానవు. కాబట్టి కృపగలవాడై ఆచరించినను, ఆకాశముమీదికి కెగరవేసిన బెడ్డ మీదనుండిపోక క్రిందపడునట్లు, ఈ కర్మములొకఫలమునుగలుగ జేసియే తీరునందుచేత నివియును పాపశబ్ద వాచ్యములగును.

75. ఒక్కపర్యాయమేతప్పు రెండవ పర్యాయముసేయ కూడదని ప్రవృత్తిస్వభావమును దెలియక నజ్ఞానముచేత దనయొక్క అనిష్టనివారణకు గాని, యిష్టప్రాప్తికిగాని, సాధనముగాదలచి సేయు ప్రవృత్తియును పాతక శబ్దముచేత జెప్పబడుచున్న కర్మజ్ఞానాదులతోఁ దుల్యమే.

76. (మోక్షయిష్యామి)యను పదమునకు ఈపాపములనుండి విడువబడిన వానినిగా జేయగలనని యర్థము.

78. (ఇష్యామి) అను (ణిచ్) ప్రత్యయమునకు విడిపింపగలనని యర్థము.

78. కాబట్టి పాపములను విడిపించుటకు నేనున్ను యొక ప్రయత్నము చేయనక్కరలేదు. నీవున్ను ప్రార్థింపనక్కర లేదు. సన్నాశ్రయించిన నీయాశ్రయణ ప్రభావముచేతనే అవి నీయొద్దనుండుటకు భయపడి మరి కనపడకుండా వానియంతట నవియె విడిపోవునని చెప్పుచున్నాడు.

79. పాపములనగా అవి వానిని గ్రహింపలేక లే గాని ప్రత్యక్షముగా కంటికిగోచరములగుపదార్థములుగావు కాబట్టి నేననుగ్రహించిన చోటునందవి యుండనేరవు.

౮౦. అనాదికాలమునుండియిదివరకు పాపములనుజూచి నీవు పడిన పాట్లు నిన్ను జూచియిటుపైని యవిపడునట్లు చేయ గలను.

81 ఇంతకాలమును నీవు స్వతంత్రుడవై నీరక్షణయత్న మును నీవె యవలంబించుటచేత నుపేక్షించినాను. ఇప్పుడు నీవు దానిని విడచుకొని పరతంత్రమైన స్వరూపజ్ఞానముచేత స్వరక్షణము స్వరూపవిరుద్ధమని యారక్షణభారమును నామీద విడచిపెట్టి నావు గనుక నిటుపైని నీరక్షణమును నీమీద విడచి పెట్టను. నాకు శరీరభూతుడవైన నీకు గలిగినట్టి యవి ద్యారూప మాలిన్యమును శరీరినైన నేనే పోగొట్టు కొనిదెను. మాలిన్య నివృత్తికొఱకు చేయు యత్నమున్ను దాని వల్ల గల్గు ఫలమున్ను నాదికాని నీదికాదు. అనిష్ట నివృత్తియు నిష్టప్రాప్తియును ఫలములై యుండగా నీశ్లోకమున (మోక్ష

యిష్యామి) అని యొక అనిష్ట నివృత్తిమాత్రము జెప్పి ఇష్ట ప్రాప్తిని చెప్పకపోవుటకు హేతు వనిష్ట నివృత్తిచెప్పగానె యిష్టప్రాప్తి తనంతటనే వచ్చును. (మామేవైష్యసి) అను శ్లో కార్థమున భక్త్యుపాయమునకు చెప్పబడిన ఫలమే తప్ప, యీయుపాయమునకు వేరు ఫలముకాకుండుటచేత నాఫలము ఈ యుపాయమునకు ఫలమని తెలుసుకోగలందులకై ఈచరమ శ్లోకమందు వేరు ఫలముచెప్పబడలేదు. (మోక్షయిష్యామి అను పదముచేత ననిష్టనివృత్తిని చెప్పుటకు హేతువేమనగా "మామేవైష్యసి" యనుశ్లోకమందు చెప్పబడిన యుపాసకుల కనిష్ట నివృత్తి వారుచేయు నుపాసనలవల్లనే కలుగును. ఈశ్లోకమందు చెప్పబడిన ప్రపన్నుల కీశ్వరుడు ఉపాయమగుటచేత వీరికనిష్ట నివృత్తినికూడా ఈశ్వరుడే చేయువలయు నిందుచేతనే అనిష్ట నివృత్తి ప్రత్యేకించి అధికముగా చెప్పబడినది.

82 (మాశుచః) యనుపదమునకర్థము శోకింపకు మని యగును.

83. నీరక్షణమందు నీవధికరించుటగాని నేనధికరింపకపోవుటగాని తటస్థించినపుడు నీ కార్యమెట్లు నెరవేరునని విచారించుట కవకాశమున్నది. అటులగాక, రక్షణయత్నమును ఫలమును నీవిగావని తెలుసుకొని నీవు నీరక్షణమందధికరింపకపోవుటచేతనున్ను ఆ హేతువుచేత నేయత్నఫలములను రెండింటినినావిగాదలంచుకొని నీకార్యమందు నేనధికరించి యుండుటచేత

సన్ను నీ వేడ్చుటకు కారణము లేదు చూడుమని వానియొక్క శోకము నపనయించుచున్నాడు.

84. (అహం) అనుశబ్దముచేత ఈశ్వరుడు సర్వజ్ఞత్వసర్వ శక్తిత్వ విరోధినివర్తకత్వాదులతో గూడియున్న తనయొక్క స్వరూపమును చెప్పి (త్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి) యనుపదములచేత నివర్తితములైన పాపములు నిన్ను జూచి వానికంటెను నవి భయపడి పాఱిపోవునుగాని నన్నే యుపాయముగా నాశ్రయించిన నిన్నపి శోధింప జాలవని చెప్పి (మాశుచః) అను పదముచేత నీవు శోకించుకారణము లేదను చున్నాడు.

85. తిరుముడిశైయాళ్వార్లు దనమనస్సునుగూర్చి ఓ చపలమనసా! సర్వేశ్వరుడు మన విరోధులను బోగొట్టిమనవలన కైంకర్యమును స్వీకరించుటకుద్యుక్తుడై యున్నాడని నీవెందుకు వ్యర్థముగా దుఃఖసాగరమున మునిగెదవని సాధించిన ప్రకారముగా నాశ్రీకృష్ణుడును యీచేతనులయొక్క సకల పాపములను బోగొట్టుటకు వానుద్యుక్తుడై నిలచిన ప్రకారమును దెలియజేసి ఇకనెందుకు శోకించెదవని వీనిని గురించి సాధించు చున్నాడు.

86. క్షమాగుణముగల నేను నీపాపములను క్షమించి అంతటితో శాంతింపక నీయందుండు వాత్సల్యముచేత వాటిని పాపములని తలంపక పుణ్యములని తలంచుచుండ నీవు శోకింప

వచ్చినా (అహం) అనుపదముచేత విరోధినివర్తకమైన యీశ్వరస్వరూపమును, (త్వా) యనుపదముచేత నివర్త్యములైన పాపములకుస్థానమైనచేతనస్వరూపమును(సర్వపాపేభ్యః)యను పదముచేత నివర్త్యములైన పాపములను, (మోక్షయిష్యామి) అనుపదముచేత వాటిని బోగొట్టు ప్రకారమును (మాశుచః) యనుపదముచేత పాపనివృత్తివల్ల గలుగు శోకనివృత్తిని చెప్పియున్నాడు.

87. తత్వనిర్ణయముజేసిన వృయ్యకొండారులుభక్తినిష్ఠులైయుండగా నాయనను బ్రపత్తినిష్ఠునిగాజేయదలంచి యీ చరశ్లోకార్థమును శ్రీభాష్యకారు లుపదేశింగా నాయన యర్థముబాగుగానున్నదని సంతోషించియును తమకు భక్తియందేరుచియున్నది గాని దీనియందురుచి లేదని విజ్ఞాపనముచేసినందుపైని భాష్యకారులవారు నీవు విద్వాంసుడవగుటచేత నీయర్థమునుబాగుగానున్నదని సంతోషించియును నిర్హేతుకభగవత్కృప నీయందులేక పోవుటచేత రుచిపుట్టినది కాదని సాయించినట్టియీవార్తను స్మరించవలయును. (దీనిని స్మరించినందువలన కేవల భగవత్కటాక్షపాత్రులకే తప్ప యితరులకీశ్లోకార్థమందురుచి పుట్టుట బహుదుర్లభమని తోచును)

88. సకల శాస్త్రములందున్ను చేయమని విధింప బడియున్న సకల ధర్మములను చేయనద్దని విధించిన యీశ్లోకము చేతనునికి తాననగా నీశ్వరుడుఉపాయమై ప్రాప్తిప్రతిబంధకము

లయిన పాపములను బోగొట్టి స్వప్రాప్తిని గలుగజేయు సర్వే
శ్వరునియొక్క స్వాతంత్ర్యమును బ్రకాశింపజేయుచున్నది.

89. ఈచరమశ్లోకార్థమున దేశసమయమున కనువాద
స్థానీయమైన యెడల విశ్వాసమునుబుట్టించి ఫలించునని పంగివు
రపు నంబిగారు సాధించేసారు. అనువాదమునగా ఎదటివాడు
పన్యసించునంశమును దానుతిరుగ జెప్పుట. యీస్థలమందు శిష్యుని
యొక్క మనస్సులో నుపాయాంతరములు స్వరూపవిరుద్ధము
లనియును ఆత్మస్వరూపము స్వతంత్రోపాయములను జేయు
టకు సమర్థముకాక కేవల మీశ్వరైకపరతంత్ర మనియును
దలచి ఈశ్వరుడే యుపాయముగావలయునుగాని యితరములు
మనకుపాయములుగాజాలవని నిశ్చయించిన వెనుక నీశ్వరుడే
నీకుపాయమని యుపదేశించునుపదేశముగాన అనువాదమని
చెప్పబడును.

90. అనువాదకోటియందె యుపదేశించుటకు హేతువు
జెప్పబడునెట్లనగా అర్జునుడు కృష్ణునియొక్క యఘటితఘట
నా సామర్థ్యమునకు బ్రకాశమగుగోవర్ధనోద్ధరణము మొదలైన
అతిమానుషచేష్టలచేతనున్న సాక్షాత్ శ్రీమన్నారాయణుడే
క్షీరసముద్రమునుండి నాగపర్యంకమును విడచి మథురాపట్టణ
మునందవతరించినాడనియును పురాణపురుషుడైన యీశ్వరుం
డు వేంచేసియుండుటచేతనే ద్వారకానగరమునకు బవిత్రతగల్గిన
దనియును పరమాత్మయగునారాయణుడే వేంచేసియున్నస్థలము

నందే జగత్తును సమస్తతీర్థములును దాననియును వేదవేత్తలును అధ్యాత్మజ్ఞానము గలవారును మహాత్ముడగు కృష్ణునే సనాతన ధర్మముగా జెప్పుచుందురనియు, నాయనా సర్వపవిత్రవస్తువులకు పవిత్రతను గలుగజేయగలవాడనియును, సర్వపుణ్యములకుం బుణ్యమనియును, సమస్తమంగళములకు మంగళమనియును, కృష్ణుడే యుత్పత్తిస్థితిలయములకు నాధుడనియును, యీచరాచరాత్మకమగు ప్రపంచమతనికే శేషమనియును జెప్పుచున్న ఋషుల యొక్క వాక్యములచేతనున్ను తమకు వనవాసదశయందున్ను పురవాసదశయందున్ను కృష్ణుడే రక్షకుడైయుండుటచేతనున్ను యీతడే మనకు రక్షకుడని నిశ్చయించిన వెనుకనే తననాశ్రయింపుమని కృష్ణుడుపదేశించుటచేతనను నాదదశయందే దీనినుపదేశింపవలయును.

91 అర్జునుడు కృష్ణుని సన్నిధిని తనకు శ్రేయస్కరమయిన యర్థము నుపదేశింపుమని ప్రార్థించినప్పుడే ప్రపత్త్యుపాయము నుపదేశింపక నుపాయాంతరములను విస్తారముగా నుపదేశించినది యీ ప్రపత్త్యుపదేశమునకర్హుడగునో కాడోయని వీని మనస్సును పరీక్షించుటకే.

92 వేదపురుషుడుపాయాంతరముల జేయుమని విధించినది దొంగపశువు స్వాధీనపడుటకు మెడలో గుదెబండ కట్టి విడుచువానివలెనే యహంకారమమకారములచేత గర్వించి యాత్మాపహారమును జేసి తిరుగువారలకు దుష్కరవ్యాపారములచేత నాగర్వము శాంతించి భగవత్పారతంత్ర్యమును స్వరూపజ్ఞానమును బుట్టించుటకొఱకు.

93 స్వరూపజ్ఞానమును బుట్టించుటకు కారణములయిన యీ యుపాయాంతరములను విడువవచ్చునాయంటే సన్న్యాసాశ్రమమునవలంబించువాడు బ్రహ్మచర్యాది పూర్వాశ్రమధర్మములను విడిచినట్లు, సిద్ధోపాయము నవలంబించుటకు దగినంత జ్ఞానపరిపాకముగలవా డీయుపాయాంతరములను విడుచుట దోషముకాదు.

94 కర్మజ్ఞానాదిరూపములైన సాధనాంతరములనువిడిచి ప్రపత్తిరూపమగు సిద్ధోపాయపరిగ్రహమును జేసిన నీయధికారి కర్మజ్ఞానాద్యుపాయాంతరములను స్వరూపతః విడువలేడు. వీటియందుం డుపాయత్వమునే విడచినాడు.

95 స్వవర్ణాశ్రమముల కనుగుణముగా చేతనుడు జేయు విహితకర్మమం దుపాయబుద్ధిఁ జేయక లోకమందుండు కృప చేత పరులకొఱకే చేయుటచేత నీకర్మమీశ్వరునకు మిగుల ప్రియమయియుండును. అందువలననే ఈశ్వరప్రీతికొఱకు చేయు కైంకర్యములోఁ జేరును. ఆత్మస్వరూప జ్ఞానపూర్వకముగా పరమాత్మస్వరూపమును సాక్షాత్కరించుట కుపయుక్తమైన జ్ఞానమందుపాయబుద్ధిబోవుటతోనేయది స్వరూపజ్ఞానములో జేరును. భగవత్ప్రాప్తికిసాధనమైన భక్తియం దుపాయత్వము పోవుటతోనే భోజనమునకు బూర్వమందుండు నాకలివలెనే యిది ప్రాప్యమైన కైంకర్యమునకు బూర్వక్షణమందుండు రుచిలోఁ జేరును. సిద్ధోపాయవరణరూపమైన ప్రపత్తియందు దుపాయత్వము పోవుటతోనే యిది భగవదత్యంతపరతంత్రమైన ఆత్మస్వరూపముయొక్క యాథాత్మ్యజ్ఞానములో జేరును.

96 భగవత్ప్రాప్తియనెడు ఫలమునకనేక జన్మసహస్రములచేతను సిద్ధించు కఠినమైన భక్త్యుపాయమునున్ను ఈ జన్మమందొక్క పర్యాయమే చేయదగినదై సకలసులభమైన ప్రపత్త్యుపాయమునున్ను ఉపదేశించుటచేత సాధనములందుండు తారతమ్యమును జూడక వాటిని మిసగాజేసి ఫలమిచ్చుచున్న సర్వేశ్వరుని యనుగ్రహమే ప్రధానము గాబట్టి ఆభక్తిప్రపత్తులుపాయములు గావు. ఈశ్వరానుగ్రహమే యుపాయము.

97 ఫలసిద్ధికి చేతనుడు జేయవలసిన దీశ్వరుడు జేయు రక్షణమును స్వయత్నముచేతను నిషేధింపకపోవుటయును వాడిచ్చు ఫలము పురుషార్థమగుటకై యర్థించుటయు నంతమాత్రము చాలును.

98 ధర్మస్వరూపులగు చక్రవర్తి తిరుమకునారు పాపిష్ఠుడైన రావణాసురుడువచ్చినా తీసుకొనిరండని చెప్పి పాపముతోవచ్చినను రక్షించుచున్నానని తెలియజేసినారు. కణ్ణన్ ఈ పుణ్యములను విడుచుకొనివచ్చిన వారిని రక్షించెదనని తెలియజేసినారు. ఇందువలన సహాయాంతరములను సహింపని యుపాయభూతుడైన యీశ్వరునికి ఆశ్రయించువారియొక్క సుకృత మనిష్టమని ఫలితము.

99 ఈ చరమశ్లోకార్థమును దెలిసికొనినవారు భగవత్ప్రభావముచేత నిది సత్యమని దీనియం దాసక్తి గలవారై రుచియు, నాసక్తియును, నమ్మకమునున్న పక్షమున నుజ్జీవించెదరు. శాస్త్రవిరుద్ధమగు నిటువంటి యర్థము నిజమగునాయని నాస్తికులయిన పక్షమునందు నశించెదరు. ఇంతకు తప్ప మధ్యనొక స్థితి లేదని సకల శాస్త్రవేత్తలగు శ్రీపరాశరభట్టరువారి కాచార్యులగు ఎంబారులు పాయించిరి.

100 ఈశ్లోకమందు జెప్పబడిన యుపాయాంతరత్యాగమునకును సిద్ధోపాయస్వీకారమునకును తగిన యధ్యవసాయములేనివానికి దీనియొక్క సంబంధమనగా ప్రసక్తిలేశమాత్రము అజీర్ణదశయందు భోజనము మరణహేతువగునట్లు వినాశమునకే హేతువగును.

101 అర్జునవ్యాజముగా ప్రసాదించినట్టియు, సత్యమగునట్టియు, శ్లాఘ్యమైనట్టియు, సులభమగునట్టియు, (మామేకంశరణంవ్రజ) యను శ్రీసూక్తిని విష్ణుచిత్తులనగా పెరియాళ్వారు విని తన్నిష్ఠులై యుండిరి అని నాచ్చియారు తిరుమొళియందు చూడిక్కొడుత్త నాచ్చియారు సాయించిన ప్రకారముగా నీశ్లోకార్థశ్రవణమున కధికారులు దీనిని విని, దీనియందు జెప్పబడిన నిష్ఠగలిగి యుండు వారలే. అర్జునమనగా కరణత్రయమొక్క విధముగానుండుట. విష్ణుచిత్తులనగా విష్ణువుచిత్తమందు గలవారు లేక విష్ణువుయొక్క చిత్తమందుండువారు.

102 ఈచరమశ్లోకార్థప్రతిపాదకములగు (నాత్తియరి పవర్) అని నమ్మాళ్వారు సాయించిన పాశురమున్ను "అత్తనాగి" అని తిరుమడిశైయాళ్వారు సాయించిన పాశురమును ఇచ్చట ననుసంధించుకొనవలయును. (మాయవళ్ళాళ్ళత్తి యావరోపార్త పిఱప్పొడు నోయొడు మూప్పొడిఱప్పివై పేర్త్తు పెరుమ్ తున్బంవేరఱనీక్కిత్త తాళ్ళిణ కీళ్ చేర్త్తవన్ శెయ్యుం శేమత్తైయెణ్ణి త్తెళివుత్తు) యీపాశురమునకు (మామేకం శరణం వ్రజ) అను వార్తను తెలుసుకొనిన వారాత్మనాచ్ఛాదించుకొనియున్న జన్మములు వ్యాధులు ముసలితనము మరణము మొ

దలయిన వాటిని బోగొట్టి, దేహావసానమందు వచ్చు కైవల్య మనే మహాదుఃఖమును వాసనతోసహా బోగొట్టి, తన తిరువడిగళ్ క్రింద జేర్చుకొని పునరావృత్తిరహితముగా సర్వేశ్వరుండు జేయు రక్షణ ననుసంధించుకొని, విశ్వాసముగలవారైతమకు విరోధినివర్తకుడై ఆశ్చర్యభూతుడైన వానికివినాగా నన్యులకు దాసులగుదురా యని అర్థము. (ఆత్తనాగి యన్నైయాగి యాళుమెంబిరానుమాయ్ ఒత్తొవ్వాదపల్పిరప్పొళిత్తు నమ్మైయాళ్ కొళ్వాన్ముత్తనార్ ముకుందనార్ పుగుందు నమ్ముళ్ మేవినార్ ఎత్తివాలిదర్కడక్కెడత్తి ఏళనెంజమే) యీపాశురమునకు హేయప్రతిభటుడైనట్టియు మోక్షసాధము నిచ్చునట్టి సర్వస్వామి జ్ఞానాకారముచేతను సమానములయి దేవమనుష్యాద్యాకారములచేత భిన్నములైన ఆత్మలయొక్క నానా విధములయిన జన్మములను బోగొట్టి, నిత్యసంసారులమైన మనలను పరిగ్రహించుటకై తల్లి తండ్రి స్వామి మొదలగు సర్వవిధబంధువునై తమపరత్వమునున్ను మననీచతనున్ను చూడక, మనలో బ్రవేశించి పొరలేకుండా కలిసియున్నాడు చపలమనసా! ఏమిచేత దుఃఖసముద్రమునందు బడియుంటున్నావని అర్థము.

ఈ చరమశ్లోకమునందు (సర్వధర్మాన్) అను పదముచేత సిద్ధోపాయస్వీకారమున కంగములగు త్యాజ్య ధర్మములను (పరిత్యజ్య) అనుపదముచేత నాధర్మములయొక్క త్యాగప్రకారమును (మాం) అనుపదముచేత త్యాగపూర్వకముగా నాశ్రయింపబడు సౌలభ్యాదిగుణవిశిష్టవస్తువును [ఏకం] అను

పదముచేత నాగుణవిశిష్టవస్తువుయొక్క యుపాయత్వమును [వ్రజ]అను శబ్దముచేత నుపాయస్వీకారమున్ను [అహం] అను పదముచేత క్రింద స్వీకరింపబడిన యుపాయవస్తువుయొక్క జ్ఞానశక్త్యాది గుణయోగమును [త్వా] యనుపదముచేత నావస్తువునందు న్యస్తభరుడగు నధికారియొక్క స్వరూపమును [సర్వపాపేభ్యః] అను శబ్దముచేత నధికారికి విరోధియగు పాపసమూహమును [మోక్ష యిష్యామి] యనుపదముచేత నాపాపవిమోచన ప్రకారమును [మాశుచః] యనుపదము చేత పాపవిమోచకుడగు నీశ్వరు నాశ్రయించిన యధికారి యొక్క నిర్భరత్వమును చెప్పబడెను.

చరమశ్లోకప్రకరణము

ముగిసెను.



వేదాంత ముద్రాక్షరశాల, బ్రాడీపేట, గుంటూరు.

శ్రీ మహాపూర్ణ గురవేనమః

శ్రీమతే రామానుజాయనమః

గురు పరంపర వాక్యములు ౧౩.

అస్మద్గురుభ్యో నమః ౧

అస్మత్పరమ గురుభ్యోనమః ౨

అస్మత్సర్వ గురుభ్యో నమః ౩

శ్రీ మతే రామానుజాయ నమః ౪

శ్రీ పరాంకుశ దాసాయనమః ౫

శ్రీ మద్యామున మునయే నమః ౬

శ్రీరామ మిశ్రాయనమః ౭

శ్రీ మత్పుండరీకాక్షాయ నమః ౮

శ్రీ మన్నాథమునయే నమః ౯

శ్రీమతే శఠగోపాయ నమః ౧౦

శ్రీమతే విష్వక్సేనాయ నమః ౧౧

శ్రియై నమః ౧౨

శ్రీ ధరాయ నమః ౧౩

శ్రీమదచ్యుత శఠగోప యతివర వరవర నిజగురుభ్యో నమః

శ్రీ మదష్టోత్తరశత దివ్యదేశవాస నిజగురుభ్యోనమః

గురు పరంపర తనయ

శ్లో॥ అస్మద్దేశిక మస్మదీయ పరమాచార్యాన శేషాన్గురూన్
శ్రీమల్లక్ష్మణయోగిపుంగవ మహాపూర్ణౌ మునీయామునం
రామం పద్మవిలోచనం మునివరం నాథం శఠద్వేషిణం
సేనేశం శ్రియమిందిరాసహచరంనారాయణంసంశ్రయే॥

తిరుమంత్రము.

ఓమ్ నమో నారాయణాయ.

ద్వయము.

శ్రీమన్నారాయణ చరణౌశరణం ప్రపద్యే
శ్రీమతే నారాయణాయ నమః

చరమశ్లోకము.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య। మామేకం శరణంవ్రజ।
అహంత్వా సర్వపాపేభ్యో। మోక్షయిష్యామి మాశుచ॥

ఆచార్య మంగళహారతి.

మంగళం భవతుతే సదా। మద్గురువర్య। రామానుజార్య॥ మం॥ రంగరాజ చరణకమల। భృంగరాజ మంగళాంగ॥ మం॥ శేషశేషిభావమును వి। శేషముగ నెఱింగి దాస। భూసురులకు దెల్పు సర్వశేషి। నిర్విశేషదోష॥మం॥ ఆర్యసంతతామోద। ధుర్య శ్రీరామానుజార్య। వర్యదాస హృదాబ్జమిత్ర ధార్యవిరచితహారికార్య॥ మం॥ ఫాలభాసు రోర్ధ్వపుండ్ర। బ్రహ్మసూత్ర మండితార్య। బాలసూర్య నిభగాత్ర। భవ్యరామసోదరార్య॥ మం॥ కోవెలన్న గురువరాంఘ్రి। సేవిత ఘనవడగనంబి। పావన చరణాబ్జమధుప। భావ శ్రీరామానుజార్య॥ మం॥

శ్రీపాదతీర్థ మంగళహారతి.

శ్రీపాదతీర్థాయ। శ్రితజనోద్ధారాయ। పాపసంహారణాయ భాసురాయ। ఆపదోద్ధారాయ। ఆర్యమాధుర్యాయ దీపించు శ్రీపాదతీర్థరాజాయ॥ మంగళం మంగళం॥ సదా

చార్య । రామానుజార్య॥ మం॥ తిరుమంత్ర ద్వయ పరమ ।
వరపద్యత్రితయగురు । పరమగుహ్యా తత్వపరత్రియాయ ।
గురురూపాచ్యుతశేత । గోపయతిరాజవర । వరరామానుజ
చరణ । వారిశుచాయ। మం॥ కోవెలన్నార్యస । త్వావనపా
దరా । జీవోజ్జీవన । సిద్ధిదాయ । శ్రీవడగసంబిచే । శిరపాద
వారిజ । సేవక రామానుజ పాదతీర్థాయ। మం।

ఆచార్య తీర్థతనయ.

శ్లో॥ శ్రీకోవెలన్న యోగీంద్ర । పాదపంకజషట్పదమ్ ।
శ్రీశాంధ్ర పూర్ణసచ్ఛిష్యం । రామానుజ గురుంభజే॥

తిరునక్షత్ర తనయ.

శ్లో॥ రౌద్ర్యబ్ధపుష్యమాసేతు । మకరార్ధ్రామహాదినే ।
ఆంధ్రపూర్ణార్య సచ్ఛిష్యం । రామానుజ గురుంభజే।

పరమాచార్య మంగళహారతి.

మంగళము భాగవత పుంగవప్రదీపున। కంగజాయుతిసుంద
రాంగునకును। మంగళము పరమార్థమార్గ ప్రకాశునకు। మంగ
ళము కలుషవిభంగునకును॥ జయమంగళం నిత్య శుభమంగ
ళం ॥మం॥ పంచమోపాయమే పరమధర్మంబనుచు పంచసం
స్కారార్థపంచకముల । సంచితంబులనెల్ల ద్రుంచగనుకృప
పజేసి। యంచితంబుగనేలు । నాచార్యుకు। జయమంగళం
నిత్య శుభమంగళం। జయతు జయమంగళం నిత్యశుభమంగ
ళం॥ మం॥ దాసానుదాసులకు। ద్వయనిష్టనాన్యులకు। భా
సురంబుగ భయముబారదోలి శ్రీసదాచార్యకృప । చేతవెలు
గొందుగురు న। త్వాశతోవడగనం। బ్యాచార్యుకు। జయ॥
అతులితంబుగచతుర। గతిని। చతురోపాయ మతినున్న కోవెల

న్నార్యపాదా। శ్రితుడువడగనంబిగురు। నతిపాదపద్మములె। గతియనుచు దాసాళి। గలసిపాడ॥ జయ॥

పరమాచార్య తీర్థతనయా

శ్లో॥ తిర్వేంగళార్యసత్పౌత్రం। కోవెలన్నసుతాధికం। జ్ఞానవై రాగ్యసంపన్నం। మాంధ్రపూర్ణగురుంభజే॥

పరమాచార్య తిరునక్షత్రతనయా.

శ్లో॥ విశ్వావస్వబ్దకన్యాఖ్యా । మాసేస్వాతిభసంయుతే । కోవెలన్నార్యసత్పుత్రం మాంధ్రపూర్ణగురుంభజే॥

పరమాచార్య శ్రీపాదతీర్థమంగళహారతి

మంగళముయతిచంద్ర మాన్యపాదాబ్జాత। మంగళము భాగవతమహితసేత। మంగళము చరమార్థ మాధుర్య కలికలుష భంగయహా శ్రీ పాద తీర్థమునకు ॥జయమంగళం॥ నిత్యశుభ మంగళం। జయతు జయ మంగళం। సదా శుభమంగళం ॥మం॥ ఈషణత్రయములను। నెడజిమ్మి కైంకర్య। శేషత్వముల నెల్ల చేతనులకు। భూషణంబుగ బోధ। పూర్ణకృపజేసిని। ద్దోషిణగహా శ్రీపాద తీర్థమునకు ॥జ॥ తిరువేంగళార్యపద। సరసీజ జనిత స। ద్గురుకోవెలన్నభా। సురపదాబ్జ। మురుతరంబుగ గొలచి। మెరయు వడగనంబిగురు వరజనిత శ్రీపాద తీర్థమునకు ॥జ॥

